నేను చాలా విచారిస్తున్నాను. అందుకు చాలా కారణములున్నవి. వ్యవసాయదారుడు అనేక రకాలైన పన్నులకు గురియై కృశించి పోవుచున్నాడు. అతడు పండించే పంటలు పూర్తిగా ప్రభుత్వంపైనే ఆధారపడకుండా దైవకృప మీదగూడ ఆధార పడి ఉన్నవి. ఎన్ని ప్రాజెక్టులు కట్టి నీటి వసతులను కల్పించినా దైవకృప లేనిది పంటలు పండడంగూడ దుస్తరమౌతున్నది. ఐనప్పటికి ప్రభుత్వం చేయవలసిన పనులు చాలా ఉన్నవి. రాయలసీమ వంటి మెట్ట ప్రాంతాలలో మైనర్ ఇరిగేషన్ పనులు వ్యవసాయ దారుకు చాలా ఉపయోగంగా ఉంటవి. అలాంటి ప్రాంతాలలో మైనర్ ఇర్రిగేషన్ పనులు విరివిగా సాగిస్తేనే రైతుకి ప్రభుత్వంవారు సహాయం చేసినట్లౌతుంది నా నియోజక వర్గమునకు సంబంధించినంతవరకు రావికుంట, నాగులకుంట అనే రెండు కుంటలున్నవి. వర్షాకాలంలో భద్రావతి నది ద్వారా వాటికి నీరు వస్తుంది. వాటి రిపేరు గురించి ఎన్నిసార్లు ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేసుకున్నటికి ఇంతవరకు రిపేర్లు ప్రారంభించలేదు. ఎస్టిమేట్లు తయారుచేసినారు. కాని రైతులు కంట్రిబ్యూషన్ ఇస్తేనేగాని సాధ్యం కాదని కలెక్టరుగారు చెప్పినారు. కాని కరువుతో బాధపడుతున్న రైతులు ఎలా కంట్రిబ్యూషన్ను ఇవ్వగలరో తామంతా యోచించాలి. కనుక కంట్రిబ్యూషన్ను ఇవ్వనవసరంలేకుండానే పని ప్రారంభించా లని ప్రభుత్వం ఆజ్ఞాపించగలదని ఆశిస్తున్నాను. ఈ నాడు రైతులు both direct and indirect పన్నులకు గురిఔతున్నారు. పన్నులనుండి రైతులను కొంతవరకైన విముక్తి చేయుటకు నేను ఒక సలహాను సూచిస్తాను. నీరా అంగళ్ళను కోఆపరేటివ్ పద్ధతిపై గాకుండ విరివిగా సాగించి ప్రతి జిల్లాలోను ప్రతి పల్లెలోను వేలం వేయించిన కొన్ని కోట్ల ధనమును సేకరించవచ్చు. మన దేశము ముఖ్యంగా వ్యవ సాయ పంటలపై ఆధారపడి ఉన్నదని అందరికి తెలుసును. కాని పశుపోషణకు కావలసిన పచ్చిక బయళ్ళు అనేక చోట్ల లేవు. పచ్చికబయళ్ళకోసం ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది. మా నియోజకవర్గంలో పశువులను బయటికి తీసుకు వెళ్ళుటకు గూడ స్థలంలేదు ఆ విషయం గత రెండు సంవత్సరముల నుండి ప్రభుత్వ దృష్టికి తెస్తున్నా ఏమీ చేయలేదు. ఇక ముందైనా జ్ఞాపకముంచుకొని పచ్చిక బయ ళ్ళను ఏర్పాటు చేయాలని వేడుకొనుచున్నాను. మెట్ట ప్రాంతాలలో ముఖ్యంగా రాయల సీమలో బావులనుండి నీరు తోడి సేద్యం చేయడం చాలా వ్యయ ప్రయాస లతో కూడిన విషయం. అందువల్ల విద్యుచ్ఛక్తిని సరఫరా చేయాలని కోరుచున్నాను. కొన్ని ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం గురించి investgate చేసి లాభ దాయకంగా లేదని చెప్పినారు. వెనుకబడిన ప్రాంతాలలో 10% remuneration కాకుండా కనీసము 7% లేక 8% కు తగ్గించాలని మనవి చేయుచున్నాను. పల్లెలలో నివసించుచున్న రైతుల అభివృద్ధి కొరకు N.E.S బ్లాక్సును ఏర్పాటు చేసి ఎంతో కృషి చేస్తున్నారు. కాని వాటిలో పనిచేసే village level workers ఇతర జిల్లాల

పండిస్తున్నాడు; "సర్వేజనా ! సుఖినోభవంతు" అని అందరకూ తుష్టిగా భోజనం పెట్టి తాను ఇబ్బందులకు పాలుకావడానికి రైతు పండించడు. నూటికి 80 మంది రైతాంగం ఉంది.

దేశంలో ఎక్కువ జనాభాయున్న గ్రామప్రజలు చెప్పుకొనే బాధలు, కోరికలు పరిశీలన చేయకుండా, తక్కువ percentage ఉన్న మనుష్యుల గురించి యోచన చేయుట నాకు అంత భావ్యంగా కనబడుటలేదు. కొంతమంది సిద్ధాంతులు తయారై తిండి గింజల ధరలు పెరిగితే Plan expenditure పెరుగుతుందని అంటున్నారు. అయితే ఈ plan లో విదేశాలనుంచి మనము ఎంతసామగ్రి తెచ్చుకుంటున్నాము? ఈ దేశంలో ఎంత ఖర్చుపెట్టుతున్నాము? ఈ విషయాలన్నీ చూస్తే నాకు ఒక పెద్ద సమస్యగాఉన్నది. కొందరి ఉద్దేశంలో ఈ వ్యవసాయశాఖామంత్రిగారు ఎప్పుడూ భూస్వాముల గురించే (సుందరయ్యగారి భాష వాడుచున్నాను) మాట్లాడతారు" అంటున్నారు. కాని నేను మాట్లాడేది ఒక్క భూస్వాముల గురించే కాదని మనవి చేస్తున్నాను. ఒకప్పుడు చిత్తూరులో బెల్లముధర బాగాఉన్నది. గోనె రు. 70 నుంచి 80, 90, 100 వరకూ అమ్మతోంది. చిత్తూరు టౌనులోచూస్తే సినిమాలలో తావుం దేదికాదు. కాఫీహోటల్సులో తావు వుండేదికాదు. జట్కాలు దొరికేవికాదు. స్కూలు పిల్లలు ఎక్కువ అయినారు, వకీళ్ళు ఎక్కువకాలము పనిచేయవలసిన అవసరం ఉండేది. డాక్టర్లు busy గా ఉండేవారు. Life busy గా ఉండేది. ఆ తరువాత బెల్లము ధర, 5, 6, 7 రూపాయిలకు వచ్చేసింది. ధరలు బాగాఉన్నప్పుడు రైతుల గురించి చిత్తూరులో మేధావులే యీమాటలు అనగా విన్నాను. "ఏమండీ, మీ వాళ్ళు పల్లెలనుంచి వస్తే కాఫీహోటలుకు పోతే పదిరూపాయిలనోటు మారుస్తారు," అనే వారు. నేను చెప్పాను — "ఏదో, ఈ రెండు నెలలూ, ధరఉన్నప్పుడు అనుభవిద్దామనుకున్నారేమో — నీ జోరు ఎన్నాళ్ళు? అంటే - మొగుడు బావినుంచి వచ్చేదాకా- అని—ఎవతో చెప్పిందట.— ఆ సామెతగా ఈ ధరలుఉన్న నాలుగు రోజులూ జోరుగా కనపడవచ్చు. ధరలు పడిపోయిన తరువాత మళ్ళీ మీకు తృప్తిగా ఉంటుంది." అని చెప్పాను. చిత్తూరు టౌనులో ఉండేవాళ్ళకు యిది కటువుగా కనపడింది. "రైతుల చెడు-కోరేటట్లుగాఉంటే మీ గోరీ మీరు కట్టుకుంటారు," అని చెప్పవలసి వచ్చింది. సరే, బెల్లముధర తగ్గింది— స్కూల్సులో పిల్లలు తగ్గారు. సెక్షన్సు తగ్గాయి; వకీళ్ళకు కేసులు లేవు; జబ్బులుఉన్నా డబ్బులులేవు కాబట్టి డాక్టర్సువద్దకు వెళ్లి రోగం బాగుచేయమని చెప్పుకొనేవాళ్ళు లేకపోయారు. సినిమా హాల్సులో ప్రేక్షకులు లేకపోయారు, జట్కా ఎక్కేవాళ్ళు కనబడలేదు, కాఫీ హోటల్సులో ఈగలుముసిరాయి. మూసేశారు. లాయర్సు బోర్డులు పక్కకు తిప్పవలసి వచ్చింది. జీవితం పడిపోయింది. టౌనులో కూర్చొని పల్లెలనుంచి వచ్చేవారిదగ్గర రు. 10, 5, సంభావన తీసుకొని బ్రతికేవారికి

కష్టమైపోయింది. కాబట్టి రైతు తుష్టుగా, పుష్టుగా ఉండి, సంతోషంగా పండించు టకు, నాగలి అదిమిపెట్టి 4 అంగుళాలు కాకుండా 8 అంగుళాలుదున్నే సత్తువ ఉన్న నాడే దేశం సుభిక్షంగా ఉంటుంది. రైతు స్థితి బాగుపడితేనే దేశం అన్నివిధాలా బాగుపడుతుంది. గౌ॥ సభ్యులు చర్చలు చేసేటప్పుడు యిందుకు మీ అందరి సల హాలు కావాలి. గ్రామాల అభివృద్ధికి, పశువుల అభివృద్ధికి, పాల అభివృద్ధికి, కోడెల ఉత్పత్తికి యితరదేశాలకు ఎగుమతికి, ఇటువంటి విషయాలన్నింటిలో సల హాలు యివ్వాలి. నెలూరుజిల్లా చింతలదీవి ఫారములో ఒక కోడెకి 32 వేల రూపా యిలకు బ్రెజిల్ దేశస్థులు అడిగారు. అంత వన్నె చిన్నెలు కలిగిన కోడె ఉన్నది. అటువంటివి తయారుచేసి ఎగుమతి చేసుకోవచ్చు. ఏ దేశంనుంచో బుడ్డిపాలు, గడ్డ పాలు, పొడిపాలు తెప్పించుకొనే పరిస్థితి కాదు ఈ దేశానికి కావలసినది. రైతులకు సరైన సౌకర్యాలు కలుగజేస్తే యితర దేశాలకు మనమే పాలు ఎగుమతి చేయగలుగుతాము. మన దేశంలోకి పాలు దిగుమతి చేసుకోవలసిన గతి పట్టదు. భూమి ఉన్నది, నీరు ఉన్నది, వసతులు ఉన్నాయి. పంటలు సరిగా పండించు కుంటే యితర దేశాలకు ఎగుమతి చేయగలిగినటువంటి వాళ్లం. అందుకు మనకు ఎక్కువ అవకాశాలు ఉన్నవికాబట్టి గౌ. సభ్యులందరూ, వెంటనే ఆచరణలో పెట్టుటకు వీలయ్యే సలహాలు యివ్వవలెనని కోరుతున్నాను.

## *Demand IV Forest Department Rs. 92,30,009*

***Sri Krishnamachari (Sangareddy):*** — I beg to move :

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

ప్రభుత్వము ద్వారా వ్యవహరించితే నష్టము వచ్చినందున అడవిపంట, కలప వ్యక్తుల ద్వారా నిర్వహించదలచడం తప్పని సహకార సంఘాల ద్వారా నిర్వహించవలెనని కోరుటను

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

ఫారెస్టు సమస్యలపై జిల్లా, రేంజి కమిటీలను యేర్పరచనందుకు నిరసనగా

***Mr. Speaker:*** — Motions moved.

***Sri K. Jaganmohan Reddy (Pargi):*** — I beg to move.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100.

To impress upon the Government to give forest banjars of Karrepalli Reserve Forest in Guntur District to the Harijan and poor persons in Karrepalli, Bodanam, Kelavaram, Chityala, Gopalapuram and Jamajigudem and the lands of Pedanemalipuri to Pedanemalipuri Harijans of Sattenapalli Taluk.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

(To criticise the Government in not constituting State, District and Range Advisory Committees)

*Mr. Speaker* : Motions moved.

*Sri Gopidi Ganga Reddy (Mudhole)* : I beg to move :

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

కోపింగును సరిగా చేయించక అడవి వృద్ధి చేయనందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

ఉన్న అడవిని కాపాడుకోక క్రొత్తగా అడవి నిర్మాణము కొరకు అనవసరపు ఖర్చులు చేసినందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

వన్య మృగాలను రక్షించే బదులు భక్షణము యింతేజాము చేయుట వలన

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

తెలంగాణాలో కంట్రాక్టరీ సిష్టము ఆపుదల చేయనందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

రైతులకు వ్యవసాయ పనిముట్లు అనగా కావలసిన కఱ్ఱలు మరియు కంపచట్ట ప్రకారము అందజేయనందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

చౌకీదార్లు అర్క-పట్టి వసూలు చేసుకుంటూ అడవిని నాశనము చేసినందులకు మరియు మేకలను అడవికి పంపుచు లంచము తీసుకొని నందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

ప్రభుత్వమువారు మేకలు మేయటానికి రిజర్వు అడవి చూపించనందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అగ్ని ప్రమాదముల ఆపుదల పండుగు ఉద్యోగులు తామే కాజేసుకొని ప్రజలచే వెట్టి చేయించుకొనటము జరిగినందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అటవీశాఖా ఉద్యోగులు సరిగా పని జరుపక లంచగొండితనము చేసినందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

కుటీర పరిశ్రమలకు అల్ప ఆదాయము వచ్చి సరుకులు అనగా వెదురు మరియు కొనకి కఱ్ఱలను ఉచితముగా యివ్వనందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

ఫారెస్టు రోడ్లను విరవిగా నిర్మించనందుకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

అడవిగల భూములనుండి కఱ్ఱను నాశనపరచి, కఱ్ఱకాని భూములను వృధాగా రిజర్వు ఫారెస్టులో చేర్చుకొన్నందులకు)

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

ఫారెస్టు నిగరాని కొరకు కమిటీలు వేయనందులకు

*Mr. Speaker* . Motions moved.

*Sri S. Ranganadha Mudaliar (Ramakrishnamrajupeta)*: I beg to move :

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

(For not taking any care in regard to the maintenance of the round-road in Chittoor Reserve Forest)

*Mr. Speaker* : Motion moved.

*Sri S. Vemayya (Buchireddipalem - Reserved)* : I beg to move :

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా తలమంచి మజరా రేగడ చెలికగ్రామ సమీపములోయున్న షుమారు 100 ఎకరములు సాగుకు లాయిక్కైన అడవి బంజరు భూమిని తలమంచి హరిజనులకు, వెనుకబడియున్న జాతులవారికి సాగుచేయుటకు టెంపరరీ పట్టాలు ఇచ్చుటలో జాప్యం చేయుచున్నందులకు

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

నెల్లూరు జిల్లాలో ఉదయగిరి తాలుకాలోని జేకెసోవరు గ్రామాల ఫారెస్టు లను ఫారెస్టు డిపార్టుమెంటుకు ఒప్పజెప్పినప్పటినుండి రైతులకు ఇబ్బందులు కలిగి స్తేవున్నై, ఎక్కువ జేస్తున్నై, ప్రభుత్వం రైతులకు ఇదివరకువున్న హక్కులను విల

బెట్టుటకు సత్వర చర్యలు తీసుకోనందులకు; ఫారెస్టు పంచాయతీలను నెలకొల్పి గ్రామాలకు సమీపములో యున్న ఫారెస్టులను పంచాయతీల పరముచేసే చర్య తీసుకోనందులకు.

*Mr. Speaker* : Motions moved :

*Sri M. Nagi Reddy (Macherla)* : I beg to move:

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా ఉప్పలపాడు వగైరా గ్రామాల గొఱ్ఱెల కాపర్లవద్ద 1953 సం. లో అదనంగా వసూలుచేసిన పుల్లరిని ఎన్ని పెటీషన్లు పంపుకొన్నప్పటికి కాలయాపనజేస్తూ యింతవరకు వాపసు యిచ్చుటకు ప్రభుత్వం పూనుకోనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

వాస్తవంగా చెట్లు లేకుండా ఉండి, లెక్కలలో మాత్రం అడవులుగా పరిగణించ బడుచున్న ఫారెస్టు ప్రాంతంలోని సాగుకు లాయకీయైన భూములన్నింటిని పరిశీలించి భూమిలేని పరిసర గ్రామాల నిరుపేదలకు సాగుకు యిచ్చుటకు ప్రభుత్వం పూనుకోనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

నాగార్జునసాగర్ ప్రాజెక్టుక్రింద మునిగిపోయిన పల్నాడుతాలూకా పుల్లారెడ్డిగూడెం, పుట్లగూడెం గ్రామాల ప్రజలకు కండ్లకుంట ఫారెస్టు భూములను మంజూరు చేయవలసినదిగా కోరినప్పటికి ప్రభుత్వం యింతవరకు మంజూరుచేయనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

నాగాయిగుంట వద్దవారికి పల్వేరు ఫారెస్టులలో ఫారెస్టు డిపార్టుమెంటులో జరుగుచున్న జాప్యాన్ని పోగొట్టి సత్వర చర్య ప్రభుత్వం తీసుకోనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

ఎన్నో సంవత్సరములనుండి ఫారెస్టుబంజరులను సాగుచేసుకొంటున్న రైతులను భూములనుండి వెళ్లగొట్టుచున్నందులకు, సాగుకు లాయకీయైన ఫారెస్టు బంజరులను సాగుకు పేదప్రజలకు మంజూరుచేయనందులకు, కోయలు, చెంచులు వెలుపలను కొండజాతులవారు అడవిఫలసాయమును ఉచితంగా తెచ్చుకొనిజీవించు అవకాశములు కల్పించనందులకు, గ్రామఅవసరముల దృష్ట్యా ఫారెస్టుహద్దులను మార్చనందులకు, ఫారెస్టుప్రాంతాలలోని కూలీలుఎండునెత్తిమోపులపై ఉచితంగాతెచ్చుకొని జీవించు

టకు అవకాశములు కల్గించనందులకు, లోగడపంచాయతీ అడవులుగానున్నవాటిని తిరిగి పంచాయితీలకు అప్పగించనందులకు, ఫారెస్టుడిపార్టుమెంటులోని లంచగొండి తనమును నిర్మూలించనందులకు. ప్రాంతీయశాసనసభ్యులతో ఫారెస్టు కమిటీలను ఏర్పాటుచేయనందులకు, నాగార్జునసాగర్ ప్రాజెక్టుక్రింద మునిగిపోతున్న గ్రామాల ప్రజలకు సమీపములో ఫారెస్టు బంజరులను మంజూరుచేయనందులకు.

To reduce the allotment of Rs. 92,30, 000 for Forest
Department by Rs. 100

ప్రభుత్వం స్వాధీనంచేసుకొన్న జమీందారీ గ్రామాల ప్రక్కనున్న అడవులకు రిజర్వులైనులను నిర్ణయించేటప్పుడు గ్రామావసరములకు తగినంత వదలిపెట్టనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Departm.ent by Rs. 100

గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా కాట్రిపాడు కొత్తూరు, మాదినపాడు శివారు భట్రిపాలెం గ్రామాల పెరుగుదలదృష్ట్యాను, గ్రామాలకు అనుకొనియే రిజర్వులైను వున్నందుననూ, ఫారెస్టుహద్దులను ఎత్తివేయనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

లోగడ పంచాయతీలో అడవులుగాఉన్నవాటిని తిరిగి పంచాయితీలకు అప్పగించనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

లోగడ ఎన్నో సంవత్సరాలనుండి సాగుచేసుకుంటున్న ఫారెస్టు బంజరు భూములను విడగొట్టి సాగుకుయిచ్చుటకు ప్రభుత్వం పూనుకోనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

చెంచులు, కోయలు మొదలగు కొండజాతులకు అడవి ఫలసాయమును ఉచితంగా తెచ్చుకొని జీవించుటకు ప్రభుత్వం తగు అవకాశమును కల్పించనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

ఫారెస్టుప్రాంతాలలోని శాసనసభ్యులతో జిల్లా ఫారెస్టు కమిటీలను ఏర్పాటు చేయుటకు ప్రభుత్వం పూనుకోనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

ఫారెస్టు ప్రాంతాలలోనున్న గ్రామాలయొక్క సరిహద్దులకు గ్రామాల

పెరుగుదల దృష్ట్యా, గ్రామ అవసరములకు తగినట్లుగా ఫారెస్టు హద్దులను మార్చు విషయంలో ఎప్పటికప్పుడు జాగు చేస్తూ ప్రజలను యిబ్బందులకు గురిచేస్తున్నందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

ఫారెస్టు ప్రాంతాలలోని కూలీలు, తదితర బీదప్రజలు ఎండుకట్టెలు నెత్తి మోపులపై ఉచితంగా తెచ్చుకొని జీవించుటకు అవకాశం కలిగించనందులకు.

*Mr. Speaker* : Motions moved .

*Sri V. Visweswara Rao (Mylavaram)* : I beg to move.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అడవి బంజరు భూములను బీదరైతులకు యిచ్చి వాటిలో జీడిమామిడితోటలు పెంచుటకు ప్రోత్సాహం కలుగచేయనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

రాష్ట్ర అటవీ సలహా సంఘమును ఏర్పాటుచేయకపోవుటను గురించి.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

జమీందారీ అడవులలో లైనులు కొట్టేటప్పుడు స్థానిక పంచాయితీలను, ఆయా ప్రాంతీయ శాసన సభ్యులను సంప్రదించుటను గురించి.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అటవీ ప్రాంత బీదప్రజలు అడవులనుండి ఎండు కట్టెలు, కట్టె కంప తెచ్చుకునే అవకాశము కలుగజేయుటను గురించి.

*Mr. Speaker*: Motions moved

*Sri K. Rajamallu. (Sirpur-General)*: I beg to move:

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

To discuss the corruption in Forest Department officials.

*Mr. Speaker*: Motion moved.

*Sri Krishnamachary*: I beg to move.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అటవీశాఖలో గల లంచగొండితనమును మాన్పించలేక పోయినందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అరణ్యములను పెంచుటలో అధికారులు సిబ్బంది తగు జాగ్రత్త వహించనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అడవులను పెంచుటకు అనువుగాని ప్రదేశములను సేద్యమునకై రైతుల పేర పట్టాలు చేయనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అడవులలో పెంచబడు చెట్లను రక్షించుటలో శ్రద్ధవహించనందులకు.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అడవులలో పశువులను ఉచితముగా మేపుకొను అవకాశము కల్పించక అవరోధములు కల్పించుచున్నందులకు.

*Mr. Speaker*: Motions moved.

*Sri G. Ramulu*: *(Huzurabad-reserved)*: I beg to move.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

అటవీశాఖలో లూటీ విధానమును ఆపివేయలేక పోయినందులకు.

*Mr. Speaker*: Motions moved.

*Sri D. Narasiah*: I beg to move.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

ఫారెస్టు చౌకీదారులు నెత్తిమోపులతో ఎండు కట్టెలు తెచ్చుకొని జీవించే వారిని నిర్బంధపరచుతున్నందులకు.

*Sri D. Narasiah: (Huzurnagar)* I beg to move.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

వ్యవసాయ పరికరాలు, సామానులకు ఉపయోగపడే కట్టెలు రైతాంగము తెచ్చుకొనుటకు అవకాశం కలిగించకుండుటను గురించి.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest Department by Rs. 100

ఫారెస్టు లైనులు గ్రామ పొలిమేరలకు పెంచుతూ గ్రామపశువులు తిరుగుటకు కూడా అవకాశం కలిగించకుండుటను గురించి,

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

సాగు లాయకు భూములను భూమిలేని బీద రైతాంగమునకు సాగుకు యిచ్చి ఆహారోత్పత్తిని ప్రోత్సహింపకుండుటను గురించి.

*Mr. Speaker*: Motions moved.

*Shri Egoor Chinappa*: (*Mahbubnagar*) I beg to move.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

పేదలు తినుబండారమైన శీతాఫలం వృక్షములను ప్రభుత్వము అటవీశాఖ వేలము వేయుచున్నందులకు.

*Mr. Speaker*: Motion moved.

*Shri B. Sriram Murthy*: (*Vizianagaram*) I beg to move.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

వ్యవసాయ పరికరాలను కలప రైతులకు ఉచితముగ యివ్వనందుననూ, కొండజాతి ప్రజలకు శాశ్వతం పుల్లరిని మాఫు చేయనందుననూ, ఎండుకట్టెలు కొట్టి జీవించెడు పేదప్రజలను ఫారెస్టు ఉద్యోగులు హింసించుచున్నందుననూ, యీ డిపార్టు మెంటులో అవినీతిని ప్రభుత్వం తొలగించనందునను, ప్రభుత్వమును విమర్శిం చేందులకు.

*Mr. Speaker*: Motion moved.

*Sri K. Jaganmohan Reddy*: I beg to move.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

అడవి చౌకీదారులు అడవిలోనుంచి నెత్తిమోత కట్టెలు బీదవాండ్లు తెచ్చు టలో ఆక్షేపించుటయు మరియు డబ్బు వసూలుచేయుట వలనను.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

అడవుల సరిహద్దులను గ్రామాదుల సమీపము వరకు పెంచుటవల్ల రైతులకు మరి పశువులకు యిబ్బంది కలుగుచుండుటవలన.

To reduce the allotment of Rs. 92,30,000 for Forest
Department by Rs. 100

అడవుల నిమిత్తం కేటాయించబడిన ప్రదేశములో ఏండ్ల తరబడి ఏమాత్రం చెట్లు పెంపకము లేనందున మరి అట్టి పొలములను రైతులకు సేద్యమునకు యివ్వ నందువలన.

# The Andhra Pradesh Legislative Assembly Debates

*[Part II - Proceedings other than Questions and Answers]*

OFFICIAL REPORT

---

*38th Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

**Monday the 8th March, 1958**

The House met at Half Past Eight of the Clock

*[Mr. Speaker in the Chair]*

### QUESTIONS AND ANSWERS

*(See Part I)*

### BUDGET - DEMANDS FOR GRANTS

| | | | |
|---|---|---|---|
| DEMAND NO. IV | Forest Department | Rs. | 92,30,000 |
| DEMAND NO. XX | Agriculture | Rs. | 2,83,86,400 |
| DEMAND NO. XXI | Fisheries | Rs. | 25,41,900 |
| DEMAND NO. XXII | Veterinary | Rs. | 94,25,500 |
| DEMAND NO. XLII | Capital outlay on Schemes of Agricultural Improvements and Research | Rs. | 62,62,000 |
| DEMAND NO. XLIX | Capital Outlay on State Schemes of Government Trading | Rs. | 5,50,43,700 |

*The Minister for Agriculture (Sri P. Thimma Reddi)* :- Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I beg to move.

"That the Government be granted a sum not exceeding Rs. 92,30,000 under Demand No. IV - Forest Department."

"That the Government be granted a sum not exceeding Rs. 2,83,86,400 under Demand No. XX Agriculture."

"That the Government be granted a sum not exceeding Rs. 25,41,900 under Demand No. XXI – Fisheries."

"That the Government be granted a sum not exceeding Rs. 94,23,500 under Demand No. XXII – Veterinary."

"That the Government be granted a sum not exceeding Rs. 62,62,000 under Demand No. XLII – Capital Outlay on Schemes of Agricultural Improvements and Research.'

"That the Government be granted a sum not exceeding Rs. 5,50,43,700 under Demand No. XLIX – Capital Outlay on State Schemes of Government Trading."

*Mr. Speaker:* Motions moved.

శ్రీ పి. తిమ్మారెడ్డి:- అధ్యక్షా! ఇప్పుడు సభవారిని మంజూరు చేయమని కోరిన పద్దులను గురించి క్లుప్తంగా నాలుగు మాటలు చెప్పడం యుక్తమనుకొంటాను. ఇదివరలో కంటె గతసంవత్సరం అడవుల రక్షణ బాగా జరిగింది. అడవులనుంచి వచ్చే ఆదాయాన్ని కూడా అభివృద్ధి చేసికోవడానికి అవకాశం పెరిగింది. Electricity Departments, Postal and Telegraph Department కు కావలసిన poles, public కు కావలసిన కలప అంతా departmental గానే market లో పెడుతున్నాము. అడవులలో కొన్నిచోట్ల చెట్లులేవని సభ్యులు అంటున్నారు. వీటిని re-generate చేయవలసిన ఆలోచన వచ్చింది. ఈ విధంగా చేసేసమయంలో వంట చెరుకునకు పనికివచ్చే చెట్లతోపాటు మనకు విదేశీ ద్రవ్యాన్ని సంపాదించే కొన్ని రకాల చెట్లను కూడా నాటడం జరుగుతోంది, గడచిన సంవత్సరం జీడిమామిడి చెట్లను అయిదువేల ఎకరాలలో పెట్టాము. వీటిలో 95% కు పైగా చెట్లు successfull గా మొలిచాయి. 3 సంవత్సరాలలో యివి కాపుకు వస్తాయి. ఆంధ్రదేశ సముద్ర తీరంలో ఈ జీడిమామిడి తోటలు బాగా పెరుగుతున్నాయి. సముద్రతీరంలోనే కాకుండా, తెలంగాణాలో కూడా అక్కడక్కడ వేస్తే అవికూడా బాగా వస్తున్నాయి. ఇవి రాష్ట్రానికే కాకుండా దేశానికంతా ఉపయోగించే ఫలసాయాన్ని యిచ్చేచెట్లు. కేంద్రప్రభుత్వంకూడా దీనికి ప్రత్యేకమైన సహాయం చేయడానికి సిద్ధంగావుంది. ఇతర దేశాలనుంచి foreign exchange ని సంపాదించుకోవడానికి ఉపయోగ పడేవి ఈ జీడిమామిడి తోటలే. వచ్చే సంవత్సరం పదివేల ఎకరాలలో ఈ జీడిమామిడి తోటలు వేయాలనే ఉద్దేశ్యం వుంది. ప్రభుత్వం ఈ చెట్లు పెట్టని చోట, వీటికి పనికి వచ్చే భూమివుంటే, private వ్యక్తులకు సహకార సంఘాల ద్వారా సహాయం చెయ్యాలనే ఆలోచన నాకు ఉంది. ఈ చెట్లు వెయ్యడం

వల్ల అడవులనుంచి వచ్చే ఆదాయాన్ని పెంచడానికి అవకాశం ఉంటుంది. కంట్రాక్టర్లకే అడవుల ఫలసాయాన్ని అమ్మకోకుండా, విదేశాలకు ఎగుమతి చేసే ఫలసాయం కూడా మనకు లభిస్తుంది. ఏఏ దేశాల్లో ఈ సరుకుకు demand ఉంది, ఏదేశానికి ఎంత సరుకు కావాలనే భోగట్టా ఇంతవరకు మన వ్యాపారస్థుల వద్దలేదు. గడచిన సంవత్సరం మన ప్రభుత్వం కేంద్రప్రభుత్వానికి వ్రాసి ఆ వివరాలన్నీ వ్యాపారస్థులకు, కంట్రాక్టర్లకు యిచ్చింది. మన అడవులలో Red Sandal woop చెట్లున్నాయి. వీటినే కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాలలో ఎఱ్ఱచందనం అంటారు. ఇదివరకు అది మామూలుగా పొయ్యేవారికి కట్టెలుగా అమ్మకమయ్యేదికానీ వ్యాపారస్థులు ఎవ్వరికీ తెలియకుండా రహస్యంగా కొంత దేశాలకు ఎగుమతి చేసేవారు. గత సంవత్సరం ఈ Red Sandal wood అమ్మకం కాకుండా నిలుపచేసి, దొంగతనంగా పోతున్న దానిని పట్టుకొని కొన్నిచోట్ల ప్రభుత్వమే కొట్టించి అమ్మకంచేస్తే వేలంలో టన్నుకు రు. 650 లు వచ్చాయి. ఇదివరలో యిదే సరకు టన్ను ఒక్కింటికి రు. 10, 15 లకు వంట చెరకుగా అమ్ముడుపోయేది. దీనికి విదేశాల్లో ఎక్కువ గిరాకి ఉంది. అక్కడ దీనికి రు. 2000 ల వరకు rate వుంది. అక్కడ దీనిని musical instruments తయారుచేయడానికి Medicines colour కు కూడా ఉపయోగిస్తారు. ఈ Red Sandalwood చెట్లు మన అడవుల్లో చాలా ఉన్నాయి. అదే విధంగా Rose wood (జిట్రేగి) చెట్లుకూడా ఎక్కువ ఉన్నాయి. దీని ధర అమెరికాలో ఘనపుటడుగు రు. 100 లు ఉంది. దీనిని యిదివరకు ప్రత్యేకించి విదేశాలకు పంపడంకానీ, అమ్మడంకానీ జరగలేదు. ఇప్పుడు Department ప్రత్యేకంగా ఈ Rose woodను సేకరిస్తోంది. మన bamboo కు కూడా గిరాకి హెచ్చుతోంది. క్రొత్తగా Sirpur Paper Mills వారు ఒకలక్ష టన్నులు కావాలంటున్నారు. మన రాజమండ్రి Paper Mills కూడా త్వరలోనే అభివృద్ధి కాబోతుంది. ఆంధ్రప్రదేశపు అడవులలో యిదివరకు వెదురుకు సంబంధించి స్థానికంగా ఉండే అవసరాలను బట్టికానీ, PaperMill కుకానీ యింక యితరములకు మూడింట ఒక వంతు మాత్రమే మనం exploit చేయగలిగాము. కానీ రాబోయే 1, 2 సంవత్సరాలలో అది పెరిగి ఆంధ్రప్రదేశ్‌లో ఉండే వెదురును నూటికి నూరుపాళ్ళు వుపయోగించుకొనే అవకాశం ఉంటుంది. ఇప్పుడు మన వెదురును Sirpur and Rajahmundry Paper Mills కే కాకుండా Tata Paper Mills కు కూడా supply చేయడానికి ఏర్పాట్లు చేస్తున్నాము. వెదురు ఒక సంవత్సరం కొడితే పోయేదికాదు. మళ్ళీ 3 సంవత్సరాలలో తయారవుతుంది. మనఅడవులను అభివృద్ధి చేయడానికి కావలసిన చర్యలను కూడా తీసుకొంటున్నాము. వీటి అభివృద్ధికి కేంద్రప్రభుత్వంకూడా ప్రత్యేకంగా సహాయం చేస్తోంది. అటు మన Agency అడవులకు, ఇటు అదిలాబాద్ అడవులకు రోడ్లెంతైనా అవసరం. రోడ్లకు కేంద్రప్రభుత్వం కొంత సహాయం చేసింది, ఇంకా ఎక్కువ కావాలని

వచ్చి వారికి తిండి సామగ్రియిచ్చి చేపలన్నిటిని తీసుకుపోతాయి. మనదేశంలో తిండికొరత తీర్చడానికి ఈ చేపలను పట్టేవిషయంలో రాష్ట్రప్రభుత్వాలు, కేంద్రప్రభుత్వం శ్రద్ధచూపవలసిన అవసరం ఎంతైనావుంది, మన రాష్ట్రానికి సంబంధించి ఎక్కువ ఖర్చుపెట్టలేకుండా వున్నాము. రు. 25 లక్షలు ఖర్చుపెడుతున్నాము. కానీ దీనివల్ల వచ్చేఫలసాయం పెరిగి తీసుకోవలసినంత తీసుకోలేకపోతున్నాము. కేంద్రంసహాయంచేసే ఉద్దేశ్యంలో ఉంది. ఈ సహాయం ప్రోత్సాహకరంగా ఉంటే చేపలుఎక్కువగా పట్టుకోవడానికి అవకాశాలుంటాయి. ఇంతకంటే చేపలు సంబంధించి మనం చేయగలిగిందేమీ లేదు. Inland లో చెరువులు, గుంటలు, కాలువలు వున్నాయి. వీటిలో వీలైనంత వరకు పెద్ద నదులలోనుంచి చేప పిల్లలను పట్టి విడిచి పెడుతున్నాము. వీటివల్ల చేపలకన్నా సుగువులు కొంచెం ఎక్కువగా ఉన్నాయి. Societies వచ్చి ఈ చేపలను, గుంటల్లోను, చెరువుల్లోను వచ్చేవి తమకివ్వమని అడుగుతున్నారు. పంచాయతీలు వచ్చి ఈ చెరువులు, గుంటలు కాలవలల్లో చేపలవల్ల వచ్చే ఆదాయం మాకులేకుండా ప్రభుత్వం societies కు దానం చేస్తే ఏలాగని వాదిస్తున్నారు. అందుచేత ఈ మత్స్య శాఖను నా అధీనంలో లేకుండా స్థానిక సంస్థల అధీనం చేయడం బాగుంటుందని చెప్పాను. ఆ విధంగా, ప్రభుత్వమత్స్య వ్యవసాయశాఖ స్థానిక స్వపరిపాలనాశాఖ సహకార శాఖలు తీర్మానించాయి. కృష్ణా, గోదావరీ నదులలోను, వాటి కాల్వలలోను చేపలు గ్రుడ్లుపెట్టే కాలంలో వాటిని పట్టకూడదని తీర్మానించాము. దీనికి కొంత మంది గౌరవసభ్యులు కూడా చేపలు పట్టకపోతే బీదలు ఎలాబ్రతకాలి అని అడుగుతున్నారు.ఒక ఋతువులో చేపలు పట్టేస్తే గుడ్లుపెట్టే బాతును చంపినట్లు అవుతుంది. నీటిలో చేపలు ఉంటేనేగాని వర్షం వచ్చిన తరువాత పిల్లలుపెట్టడం జరుగుతుంది. వాటిని ఇతర ప్రాంతాలకు పంపుకోవచ్చును అని మనవి చేస్తున్నాను.

వెటర్నరిశాఖ గురించి కొంత చెప్పవలసి ఉన్నది. తాలూకాకు ఒక ఆసుపత్రిని కూడ పెట్టలేని స్థితిలో ఉన్నాము. విజముగ ప్రతి ఫిర్కాకు ఒకటి అవసరం. మనిషికి జబ్బుచేస్తే బస్సులోగాని, మంచముమీదగాని వేసి 50 మైళ్ళు 100 మైళ్ళు అయినాతిసుకొని వెళ్ళవచ్చును. పశువులకు జబ్బువస్తే లారీమీద, బండిమీద చాలకష్టము. అయితే గోపాలరెడ్డిగారు ఏ పన్ను వేసినా కూడా ప్రజలు భరించలేరు అంటారు. ప్రజల అవసరాలు తీర్చడానికి డబ్బు లేకుండా ఉన్నది. ఆసుపత్రులు ఎక్కువ కావలసిన అగత్యం ఉన్నది. డాక్టర్లు కావలెను 60,70 మందిని కనీస అవసరాలకు ప్లానింగు డిపార్టుమెంటుకు ఇవ్వవలసి వచ్చింది. అందుకని కేంద్ర ప్రభుత్వం లేదంటే కూడా ఆంధ్రలో ప్రయత్నం చేసి వెటర్నరీ కాలేజి తెప్పించుకున్నాము. short courses రెండు సంవత్సరాల courses రాజేంద్ర నగరులోను, తశాఖపట్టణంలోను పెట్టి కొందరికి తరిఫీదుఋస్తున్నాము. కాని మనపక్ష

కావలసిన పశువైద్యులు లేకుండా ఉన్నారు. ఇప్పుడుకొన్ని పంచాయితీలలో పూర్తి ఖర్చు భరించుకొంటాము, బిల్డింగ్సు ఇస్తాము, ఆసుపత్రి ఇప్పించి అని అడుగు తీన్నారు. కొందరు డాక్టర్లు ఖర్చులుకూడా ఇస్తామంటున్నారు. అయితే తగినంతమంది డాక్టర్లులేక వీలులేకుండా ఉన్నది. Artificial insemination centres చాలా popular గా ఉన్నవి. వాటికి కొన్ని పథకములు ఉన్నవి. ఉద్యోగస్తుల జీతాలకు డబ్బు చాలకము లేదు ఒక్కొక్క ఆసుపత్రికి సుమారు 10,15 వేలకు వచ్చును. ఉన్న దానిలో ఎక్కువ చెయ్యడానికి కృషిచేస్తున్నాము. ప్లానింగు డిపార్టుమెంటులో ఉన్న వెటర్నరీ ఉద్యోగములవల్ల preventive side చాల ఉపయోగముగా ఉన్నది. పశువుల కొట్టాలు N.E.S. Development Block లలో ఏర్పాటు చేస్తున్నాం. స్పెషలు ఆఫీసర్లద్వారా ఎక్కువ ప్రచారము జరుగుచున్నది.

తరువాత వ్యవసాయము విషయములో రైతులకు ట్రాక్టర్లు, ఆయిలు ఇంజన్లు ఎలక్ట్రిక్కు మోటార్లు ఇవ్వగలుగు చున్నాముగాని అవసరమైనన్ని ఇవ్వలేకుండా ఉన్నాము. వీలైనంత వరకు దిగుమతులను తగ్గించి మన దేశములో తయారైన వాటినే ఉపయోగించ వలెనని ప్రభుత్వ ఉద్దేశము. రైతులకు అప్పులు ఇచ్చి వ్యవసాయ శాఖవారు సహాయము చెయ్యడానికి ప్రయత్నము చేస్తున్నారు. ఆంధ్ర జిల్లాలకుగాని హారాలో ప్రత్యేకమైన కృషిచేసి ఎలక్ట్రిక్కు మోటార్లు, ఇంజన్లు తయారు చేస్తున్నారు. రైతులకు ఎరువులుకూడా విరివిగా లభింప చేస్తున్నాముకాని కంట్రాక్టర్లకు లారీలకుఎక్కువ charges కట్టవలసి వస్తున్నది. ఇదివరకటి నిబంధనలను మార్చి charges తగ్గించి రైతులకు అందుబాటులో ఉండేటట్లు చెయ్యవలసి ఉన్నది. ట్రాక్టర్లు వ్యవసాయమునకే కాకుండా వ్యాపారానికి కూడ ఉపయోగించినట్లైతే పద్ధి కిట్టుబాటు అవుతుంది. ఈ పన్ను తగ్గిస్తే ఎక్కువ రాబడి వచ్చే అవకాశం ఉన్నది. కాబట్టిదానిని ఒక పద్ధతిలోనికి తీసుకు రావలసి ఉన్నది.

మార్కెటింగ్ గిడ్డంగులు కేంద్ర ప్రభుత్వ సహాయముతో రాష్ట్ర మంతట కట్టవలసి ఉన్నది. కాని రాష్ట్రప్రభుత్వం ఆ సహాయమును వినియోగించుకొనలేకుండా ఉన్నది. గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో పొగాకు పంటకు ఆకు మార్పు చెయ్యడానికి కష్టముగా ఉన్నది. మార్కెటింగు గిడ్డంగులు లేవు. ఆ మూడు జిల్లాలలోను 3 లక్షల ఎకరాల మీద పొగాకు పంట పండిస్తున్నారు. గిడ్డంగులకు కొన్ని లక్షలుకాదు, కొన్ని కోట్లు కావలసిఉంటుంది. ఏదో ప్రయత్నం చేస్తున్నాము. ఈసారి పొగాకు వ్యాపారస్తులతో సంప్రదించిన మీదట ఈ సంవత్సరం వర్జీనియా పొగాకు రైతులకు సంతృప్తికరమైన ధరలకు కొంటున్నారు.

శ్రీ ఎస్. వెంకయ్య (అద్దంకి): ఇప్పుడు మార్కెట్టు మళ్ళీ తగ్గిపోయింది.

శ్రీ పి. తిమ్మారెడ్డి : కారణములు విచారించవలసి ఉంటుంది. "రైతులకు సరైన ధరయిస్తే మీకు ఏమీ ఇబ్బంది ఉండదని, వారికి ఇబ్బంది అయ్యేపరిస్థితులు తీసుకవస్తే మిమ్ములను ప్రభుత్వం ఒక కంట కనిపెడుతుంద"ని వ్యాపారస్తులకు ప్రారంభములో చెప్పినాము. వివరములను విచారించి చెప్పగలను. మనరాష్ట్రములో సంవత్సరం సంవత్సరం పంటలు హెచ్చుతున్నవి గాని తగ్గడములేదు అని మనవి చేస్తున్నాను. రైతులు చారెడు నీరుతో దోసెడు గింజలు పండించడానికి ప్రయత్నములు చేస్తున్నారు. శాసన సభ్యులుగాని మంత్రులుగాని ఎక్కడకు వెళ్ళినా రైతులు తమకు ఆయిలు ఇంజన్లు కావాలి, బావులుకావలెను, ఎరువులుకావలెను సహాయము చెయ్యండి, దోహదం చెయ్యండి అని ఆంధ్ర రైతాంగము చెబుతున్నారు. ప్రభుత్వం చెయ్యగల్గిన కృషి చేస్తున్నారు. కాని ఆకృషి చాలడము లేదు. విద్యుత్ అన్ని గ్రామాలకు సరఫరా కాలేదు. చెరువుల, కాల్వల మరమ్మతులకు మనవద్ద డబ్బులేదు. కేంద్రము ఇచ్చే డబ్బు చాలడంలేదు. పూడిపోయిన చెరువులను మరమ్మతు చెయ్యడానికి వీలు కలుగడములేదు.

Forests లో వుండే చెరువులను కూడా repair చేసుకోవలసిన అవసరమున్నది. చిన్న ప్రాజెక్టులను, మేజర్ ప్రాజెక్టులను కట్టుతున్నాము. యీ మేజర్ ప్రాజెక్టుల విధానమే దేశాన్ని సుభిక్షం చేస్తుందంటే అదిసరికాదు. ఎందుకంటే, మెట్ట ప్రాంతాలకు మేజర్ ప్రాజెక్టులు అంత ఉపయోగముకావు. కొన్ని ప్రాంతాలకు ఇంతో అంతో ఉపయోగము కావచ్చును. కాని మెట్ట ప్రాంతాల అన్నిటికి కూడా బావులు కావాలి. మామూలుబావులు చాలవు. 3 వందల నాలుగు వందల అడుగుల లోతున వుండేటటువంటి నీటినిపైకితీసే బావులువుండాలి. మనదేశంనుంచి విదేశాలకు పోయినవాండ్లు కొందరు చెప్పతున్నారు. ఆస్ట్రేలియాలోనేమి, కెనడాలోనేమి 12 వందల 14 వందల అడుగులలోతునుంచి Bores వేసి అక్కడనుంచి నీళ్లతీసి వ్యవసాయము చేస్తున్నారంటే మనదేశంలో 100 అడుగులు 150 అడుగుల వరకుకూడా పోలేకుండా వున్నాము. మనరాష్ట్రంలో అనేకచోట్ల East Godavari, West Godavari జిల్లాలలో యీ filter points చాల బాగావచ్చినాయి. ఒక్క East Godavari జిల్లాలోనే యీ filter points 2700 ఉన్నాయి. Coast line లో శ్రీకాకుళంనుంచి నెల్లూరువరకు కూడా filter points వడడానికి చాలా అవకాశాలున్నాయి. 30,40 అడుగులలోతు త్రవ్వేటట్లయితే filter points ద్వారా కావలసినన్ని నీళ్లు సులభముగా దొరుకుతున్నాయి. Electricity కావలసిన అగత్యము వుంటుంది. లేకపోతే oil Engines అయినా కావాలి. మోటతో నీళ్లు బయటకు తీసేదానికి ఇబ్బందిగా ఉంటుంది. అందువల్ల యీ filter points ను పెంపకం చేసేటట్లువుంటే మన దేశంలో 20 వేలు 30 వేలు filter points ను పెంచడానికి వీలు వుంటుంది. కాని వాటికి అవసరమైన పెట్టుబడి లేకుండావుంది. Filter

points వేసేటట్లుగావుంటే Electric Engines లేక oil engines కావలసివస్తుంది. Oil Engines సామాన్యరైతుకు అందుబాటులోలేవు. Electricity ఉంటే 5 లేక 6 వందల రూపాయలు ఉంటేనే Electric motor ను కొనడానికి వీలుంటుంది. కాని Electricity ని వ్యాప్తిచేయాలనుకొంటే అది పెద్ద పెట్టుబడితో కూడుకొనిన పని. అదికూడా వెంటనే సాధ్యమయ్యేటట్లులేదు. ఏమైనప్పటికీ, ప్రభుత్వం ఎలా ఉన్నప్పటికీ, రైతాంగము పంటలు బాగాపండిస్తున్నారు. దేశపు మొత్తపురాష్ట్రాలలో మనరాష్ట్రముదే మొదటిస్థానమని నేను మనవిచేస్తున్నాను. రైతులు చాలాబాగా పండిస్తున్నారు. ఒక్క తిండిగింజలే కాకుండా నూనెగింజలు కూడా ఆంధ్ర ప్రాంతములోను తెలంగాణాలోను ఎక్కువగా పండిస్తున్నారు. తెలంగాణాలో ఆముదాలు చాల ఎక్కువగా పండుతాయి. నిన్ననే oil seeds Specialist ఢిల్లీనుంచి వచ్చి చెప్పినాడు. తెలంగాణాలో నల్లగొండ, వరంగల్, కరీంనగర్ జిల్లాలలో దాదాపు 130 వేల రూపాయలను యీ ఆముదపుపంటను వ్యాప్తిచేసేదానికి, ఖర్చుపెట్టుతామన్నారు. మాములుగా వేసే ఆముదాలపైరునుంచి ఎక్కువ పంట పండించడానికి ఏమి చర్యలు తీసుకోవాలో దానిని గురించి పరిశోధనచేసేదానికై కేంద్ర ప్రభుత్వము 1½ లక్షల రూపాయలు ఖర్చుపెట్టడానికి సిద్ధంగాఉందని ఆయన చెప్పినారు. ఈ నెలలోనే 14 నుంచి 19వ తేదీవరకు All India Oil Seeds Committee వారి సమావేశం ఇక్కడ జరుగబోతున్నదనుకుంటాను. దేశమొత్తము మీద ఆంధ్ర ప్రదేశ్‌లో Oil Seeds కు సంబంధించి ఎక్కువపంట ఉన్నది. ఒక్క వేరుసెనగే 100 కి 30 వంతులకు పైగా పండుతుంది. ఇక ఆముదాలు తీసుకొన్నట్లైతే 70% కు పైగా మన ఆంధ్రదేశంలోనే పండుతున్నాయి. Oil seeds లో కూడా మనదే ముందుచెయ్యి. కాని దీనిని ఎక్కువ పెంపకము చేయడానికి అవకాశాలున్నాయి. దీనికి యిబ్బంది ఎక్కడ వస్తుందంటే పరిశోధన అనేటప్పటికి సామాన్య ప్రజలకేకాదు, పరిపాలకులకు కూడా యీ పరిశోధన విషయలో అంత నమ్మకములేదు. ఎందుకంటే పరిశోధన అనేటప్పటికి, మొదట డబ్బు దండుగ చేసేటట్లుగా కనబడుతుంది. ఒక లక్షకావచ్చును. 2లక్షలు కావచ్చును లేక 10 లక్షలు కావచ్చును, కాని యీ చిన్న విషయాన్ని పరిశోధనలో తెలిసికొనేటట్లైతే క్రొత్తమందునో, క్రొత్త seed నో కనుక్కొనేటట్లైతే కోట్లకొలది రైతులకు ఉపయోగకరంగా ఉంటుంది. కాని పరిశోధనను గురించి మాత్రము చూపించవలసిన శ్రద్ధను చూపించ లేక పోతున్నామని అనిపిస్తున్నది. ఈ చెరువుకు గట్టు కట్టాలని, ఆ కాల్వకు గట్టు కట్టాలని చెప్పగలుగుతున్నామేకాని పరిశోధనలేని కారణంచే దేశంలో ఎంత per cent పంట తగ్గిపోతున్నదో ఎక్కువమంది యోచన చేయడములేదు. దీనిని గురించి ప్రత్యేకంగా ఆలోచన చేయవలసిన అవసరము ఉన్నదని నేను మీకు మనవి చేస్తున్నాను. వ్యవసాయశాఖలో ఉండే వుద్యోగస్థులు కూడా దేశము మొత్తము మీద ఎన్నివ్యాధులు ఉన్నాయి, స్థావరంగా ఏలాంటి పద్ధతులను ఉపయోగిస్తున్నారు

అనేటటువంటి ఛోగట్టాకూడా సేకరించడము లేదేమోనని నాకు అనిపిస్తున్నది. ఏ ప్రాంతాలలో ఏ రోగాలు వస్తున్నయో ఆ రోగాలకు స్థానికంగా ఏలాంటి మందులు వాడుతున్నారో ఇపుడు ఇతర దేశాలనుంచి తెప్పించిన మందులు ఏరోగాలకు వాడ వలసిన అగత్యమో తెలిసికోవలెను. ఇంకొక విషయము కూడా మీకు మనవి చేయాలి. రోగాలకు మందులున్నాయి. కాని భూమిమీద వచ్చేటటువంటి ఫలసాయా నికి మించి మందుల ధర ఉన్నది. దానివల్ల ఏమౌతుంది? సామాన్య రైతులు "మేము యీ మందుల వాడకమువల్ల ఏమిలాభ మున్నది. మీరు మందులు వాడమంటారు కాని వచ్చే ఫలసాయం కంటే మందుల ధరయే ఎక్కువ ఔతుంది" అని అంటారు. పోయిన సంవత్సరం నెల్లూరు జిల్లాలో రు. 6 లక్షలకు పైగా మందులు వాడినారని విన్నాను. కాని నేనక్కడికి పోయినపుడు చాలమంది రైతులు గోడుగోడు మన్నారు. ఒక రైతు నాతో చెప్పినాడు. "నేను ఎకరాకు 150 రూపాయలమందు వేసినాను. పంట బాగానే పండిందికాని దానిని అమ్ముకుంటే యీ 150 రూపాయలుకూడ గిట్ట లేదు" అన్నాడు. ఈరోజు దేశంలో బ్రహ్మాండమైన ఆందోళన బయలు దేరింది ధరలు పెరిగినాయని. దీనికి ఒకటేమనవి చేస్తున్నాను. 1952-53 లో procurement చేసినపుడు ఏ ధరతో రైతుఇంటి దగ్గర ప్రభుత్వము సేకరించినదో యీ దినము రైతు కు అదేధర గిట్టుతున్నది. ఏదైనా విమర్శకు పూనుకునేముందు అచటి పరిస్థితులను తెలిసికొని విమర్శకు పూనుకుంటే చాలా బాగుంటుంది. వేరుసెనగ 9 రూపాయ లమ్మింది. యీ దినము 3-8-0, 4 రూపాయలకు వచ్చింది. నేనొకటి మనవి చేస్తున్నాను. నేను ఒకసారి మాట్లాడేటప్పుడు బాధ్యతతో మాట్లాడలేదని కొంతమంది అనుకొనేటట్లుగా ఉంటుంది. ప్రభుత్వము కొన్ని విధానాలను రూపొందిస్తుంది. ఈ మధ్యనే మీరుకూడా వినివుంటారు. ఇతరదేశాలకువేరుసెనగ ఎగుమతి చేసేవిష యము వచ్చినపుడు దానిసంగతి ఇంకా 3 నెలలకుగాని చెప్పడానికి వీలులేదని కేంద్ర ప్రభుత్వం అన్నది. ఏమౌతుంది యీ 3,4మాసాలలోపల? దానిని గురించి April నెలలో నిర్ణయం చేసేటట్లుగా ఉంటే ఆవేళకు సరకు రైతులనుంచి వ్యాపా రస్తుల godowns లోనికి వెళ్ళిపోతుంది. ఈ వేరుశెనగపంట నవంబరు డిశంబరు మాసాలలో రైతుఇంటికి వస్తుంది. ఆ విధంగానే జనవరి, ఫిబ్రవరి, మార్చి నెల లలో ఆముదాలు తయారౌతాయి. ఈ దేశంనుండి ఆముదాల export ను ఏ నవంబర్ నెలలోనో నిర్ణయము చేస్తే ఆలోపల ఆముదాలన్నీ రైతు యింటినుంచి వ్యాపారస్థుని దగ్గరకు పోతాయి. ఇటువంటి విషయాలలో చాల సాధక బాధకా లున్నాయి. దీనిని మరీ మరీ చెప్పడానికి నాకేమాత్రము అలుపులేదని మనవిచేస్తున్నాను రైతు పండించే దానికి సరియైన ధరలేకుండా పోయేటట్లైతే ఎవరెన్ని ఉపన్యాసాలు. చేసినా దేశంలో ఎక్కువ పంట పండించడానికి ఏసుపనిచేయవు అని నేను మనవి చేస్తున్నాను. "ఈ బీద భూమిలో నేను ఎక్కువగా కష్టపడి, '50 మైళ్ళనుంచి ఆకు తీసుకొని వచ్చి, పది మైళ్ళనుంచి మన్ను తీసుకొనివచ్చి ఏ ధరతో

నైనా సరే ఎరువు తీసుకొనివచ్చి పంట పెట్టి ట్లైతే, 2 వందల రూపాయలు పెట్టుబడి పెట్టినాను కాబట్టి 210 రూపాయలు నాకు వస్తుంది" అని రైతుకు విశ్వాసమున్నపుడే ఎక్కువగా పండిస్తాడు. ఈ మధ్యనే coastal districts కు పోయినాను, ఏమయ్యా రెండవ పంటగింజలు పండించ లేదంటే — గింజలధర మీరు నిర్ణయము చేయ లేకున్నారు, ఏమి చేస్తుందో ప్రభుత్వ మని మాకు అనుమానముగా ఉన్నది. ఈ ధాన్యము పండించేదానికంటే వేరుసెనగ వేసుకుంటే ఏదో వచ్చినంతవరకే వస్తుందనే ఉద్దేశంతో మేము వేసినామని గుంటూరు జిల్లాలో కొంతమంది చెప్పినారు. West Godavari జిల్లాలో కూడా నాకు కొంత మంది చెప్పినారు. ఎందుకయ్యా ధాన్యము పండించకూడదా? అంటే "ఏమౌతుందో ఏమో; మీరు ఏ నిర్ణయాలు చేస్తారో? చర్చలు చూచినట్లైతే చాల ప్రమాదంగా కనబడుతాయి" అని అంటారు. ఉలవగింజలు వేసుకుంటే గొడ్లకైనా పనికివస్తా యని చెప్పే మాటలను విన్నాను. అది ఏమౌతుందంటే చిన్నచిన్న చినుకులే పెద్దనదులు ఔతున్నాయి. అక్కడక్కడ రైతులుచేసే ప్రయత్నాల వల్ల దేశంలో surplus కు కారణమౌతుంది. రైతులు నిరుత్సాహముగా ఉంటే అక్కడక్కడ 10 ఎకరాలు 100 ఎకరాలకు తగ్గిపోయినట్లైతే దేశంలో deficit ఇంకా ఎక్కువ కావడానికి కూడా అవకాశాలున్నాయి. అందువల్ల ఒక్కవిషయం మాత్రము మనవి చేస్తున్నాను. పార్టీల విపక్షత లేకుండా ప్రతి ఒక్కరు కూడా ఇంతకంటె రైతుల కొరకు కృషి చేయవలెను. మనము రాజకీయాలలో తిరిగే వాండ్లము కాబట్టి కూలి వాండ్లదగ్గరకు వెళ్ళినపుడు కూలివాని మాట, వ్యాపారస్థుల దగ్గర పోయినపుడు వ్యాపా స్థులమాట మామూలుగా మాట్లాడటము సహజము. మనము ఇక్కడ ఏమి మాట్లాడు తామో Platforms మీద ఏమి మాట్లాడుతామో గ్రామాలలో ఉండేవాండ్లకు తెలి యదు కాబట్టి సరిపోయింది. లేకపోతే మనము మాట్లాడేమాటలు చేసే చర్చలు పూర్తిగా ఒక report తయారుచేసి వారికి ఏఏ గ్రామాలలో నైతే ఓట్లు వచ్చినాయో వాండ్ల దగ్గరకు వెళ్ళి ఇదిగో నేను యీ రకంగా మాట్లాడినాను అని చెప్పేటట్లుగా ఉంటే అపుడు తెలుస్తుంది. మనము చేస్తుందేమని. ఎంతవరకు మేలుగా ఉంది? ఎంతవరకు కీడుగా వుంది, నష్టమెంత లాభమెంత అనేది తెలుస్తుంది. ఓట్లు సంపాదించు కొనేటంతవరకు ఒక విధంగా మాట్లాడుతాము. ఆ తర్వాత గ్రామాలనుంచి పట్టణాలకు వచ్చిన తర్వాత పట్టణాల గాలిపీల్చి యీ వాతావరణములోనికి వచ్చేటపుడు దానికి సంబంధించినట్లుగా ఇక్కడ మాట్లాడుతాము. ప్రతిఒక్కరుకూడా యీ ధరలవిషయంలో కొంచెము అక్కరగా చూడండి. సుందరయ్యగారు నిన్న గోపాలరెడ్డిగారి ఉపన్యాసానికి జవాబు చెప్పుతూ భూస్వాములు, భూస్వాములు అన్నారు. భూమివున్నవాండ్లంతా కూడ ఎకరావున్నా భూస్వామే. పాతిక ఎకరాలున్నా భూస్వామే. భూస్వామి అంటే భూమికలిగిన వాడు భూస్వామి.

పూర్వం మదరాసు రాష్ట్రంలో ల్యాండు హోల్డర్సు కాన్‌స్టిట్యూయన్సీ అంటూ ఉండేది. ఈ కాన్‌స్టిట్యూయన్సీలో ఒక్కొక్క జిల్లాకు 20, 30 మంది వోటర్లు మాత్రమే ఉండేవారు. మా చిత్తూరు జిల్లాలో మాత్రం చాలా మంది ఉండేవారు. పానగల్ ఎస్టేట్ పటాపంచలు అయినప్పుడు గ్రామం కొన్నవాడు, 10 ఎకరాలు కొన్నవాడు, అందరూకూడా ల్యాండు హోల్డర్సు కాన్‌స్టిట్యూయన్సీలో వోటర్సు అయినారు. ఒక చిత్తూరు జిల్లాలో మాత్రం 256 మంది వోటర్లు వుండినట్లు నాకు జ్ఞాపకం. కడప, కర్నూలు మొదలైన జిల్లాలో 40,50 మంది మాత్రమే ఉండేవారు. వారందరిని కలిపి. ల్యాండు హోల్డర్సు కాన్‌స్టిట్యూయన్సీలో వోటర్సుగా ప్రకటించే వారు. భూమి ఉన్న ప్రతి ఆసామీ భూస్వామి అని చెప్పినందువల్ల ప్రయోజనం లేదు. కృష్ణా, గుంటూరు జిల్లాలలో పాలేరుగా వున్న మనిషికూడా తన కిచ్చినటువంటి 15, 20 బస్తాల జీతంలో... అతని భార్య కూలీనాలీ చేసుకుంటూ ఆమె పొట్ట ఆమె పోసుకుంటూ వుంటే .... .... అయిదు, పది బస్తాలు అమ్ముకుని ఆ డబ్బుతో ఇతర అవసరాలు తీర్చుకుంటూ ఉంటాడు. శ్రీ సుందరయ్యగారి పార్టీవారికి గ్రామాలతో సంబంధం ఉన్నది. వారు గ్రామాలకు పోయి చూచినట్లయితే యదార్థ పరిస్థితులు తెలుస్తాయి. ఒక ఎకరంలోనో, రెండెకరాలలోనో వేరుసెనగ, లేక యే యితర పంట పండించుకొన్న అతనికి వచ్చే ధాన్యంలో కొంత అమ్ముకొని, తన యితర అవసరాల ఖర్చులు జరుపుకొనవలసి యున్నది. సన్నకారు రైతుకూడా తాను పండించిన పంటలో కొంత భాగం అమ్ముకోవాలి. వేరుసెనగ వేసినా, వరి వేసినా, రాగులుగాని, జొన్నలుగాని, మరే దాన్యాలు పండినా వాటిలో కొంత భాగాన్ని అతడు అమ్ముకొంటేగాని జీవితావసరాలను సేకరించుకోడం కష్టం. ధాన్యపు ధరలు హెచ్చుగా ఉన్నట్లయితే, పెద్ద భూస్వాములకే లాభం వుంటుంది గాని, సన్న రైతులకు లాభం వుండదని గ్రామాలకు సంబంధంలేని వారెవరో చెబితే చెప్పవచ్చుగాని, గ్రామాలకు నిత్యం సంబంధం ఉన్నవారు చెప్పలేరని నేననుకొంటున్నాను. ఆ విధంగా చెబితే జనం నమ్మలేదు. పెద్ద ఆదాయాలు వచ్చే వారినుండి ఎక్కువ పన్నులు వసూలు చేయడానికి మేము సంసిద్ధంగా ఉన్నాము. ఇన్‌కంటాక్సు విషయంలో 3 వేల రూపాయలలోపు ఆదాయం వచ్చేవారికి పన్నులేదు—ఆపైన వచ్చే వారికి పన్ను వున్నది. లక్షలు, కోట్లు ఆదాయం వచ్చేవారికి నూటికి 99 రు. ల వరకు కూడా పన్ను వున్నది. అటువంటి సలహాలేమైనా ఉన్నట్లయితే, శాసన సభ్యులను చెప్పమని కోరుతున్నాను.

శ్రీ కె. యల్. నరసింహారావు (ఎల్లందు-జనరల్) :- హైదరాబాదు రాష్ట్రంలో ఉండేటటువంటి అగ్రికల్చర్ ఇన్‌కంటాక్సునుకూడా మొన్ననే రద్దు చేశారు.

శ్రీ పి. తిమ్మారెడ్డి:- అటువంటి పన్నులు చాలా వున్నాయి. ఉన్నవి కొన్ని పోవాలి. లేనివి కొన్ని రావాలి; ఏదైనా ఒక పన్ను విధించినప్పుడు అది ఆచరణ యోగ్యంగా, ఉపయోగకరంగా ఉండాలి. నాకు ఉన్నారు మా ఊరిలో దండు నూరు మంది అంటే ప్రయోజనం లేదు. ఆదాయం వచ్చే పన్నులుండాలి. అయితే ఏదో ఒక సిద్ధాంతాన్ని మనసులో పెట్టుకొని మాట్లాడవద్దని నేను మనవి చేస్తున్నాను. భూమి అనేది వ్యక్తికి ఉండకూడదనేది కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంతం.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ):- కానేకాదు.

శ్రీ పి. తిమ్మారెడ్డి:- రష్యాలోకూడానా ? కలెక్టివ్ ఫారమ్స్‌లో కూడా ఆ ఫారమ్ పేరుతో ఏవైనా పరికరాలను కలిగి ఉండడానికి వాళ్లు ఇప్పుడిప్పుడే కోరుకొంటున్నట్లుగా కన్పిస్తున్నది. చైనాలో సంస్కరణలు చేస్తున్నారు. చాలాబాగా చేస్తున్నారు. పదిసెంట్లురావచ్చు. ఒకగ్రామంలో ఉండే మనుష్యులందరకూ ఆ గ్రామంలోని భూమినంతనూ పంచినట్లయితే ఒక్కొక్కనికి సెంటు రావచ్చు, ఆ వ్యక్తికి ఉండే భూమి గొడ్డును పెట్టుకోకుండా, ఉత్పత్తి పరికరాల వంటివేవి పెట్టుకోకుండాభూమిని బీడుగా పెట్టుకోడానికి,ఎంతైతే వీలుంటుందో అంతతక్కువ భూమిఇస్తున్నారు. విధి లేకుండా కో-ఆపరేటివ్స్ అనే పేరుతో వుండే కలెక్టివ్స్‌లోకి జనం అంతా వచ్చేట్లు చేస్తున్నారు. వారికి వేరు మార్గం లేదు, గతిలేదు. అంతకూ ఎవరో ఒక దౌర్భాగ్యుడు 'నా భూమి వారగానే ఉంటుంది' అంటే అతనికి సాంఘికంగా మర్యాద, మన్నన లేకుండా చేస్తున్నారు. ఈదినం చైనాలో కో-ఆపరేటివ్స్ ఉన్నాయి. వాటిని కో-ఆపరేటివ్స్ అని అనవచ్చునా ? అని అడుగుతున్నాను. అజ్ఞానంలో వున్న మనుష్యులు, అనుభవం లేని మనుష్యులు, పూర్తిగా తెలియని మనుష్యులు ఎవరైనా వాటిని కో-ఆపరేటివ్స్ అనవచ్చునేమో గాని, అవి కో-అపరేటివ్స్ కానే కావు. కో-ఆపరేటివ్స్‌గా కనబడే కలెక్టివ్స్ మాత్రమేగాని అవి కో-ఆపరేటివ్స్ మాత్రం ఎన్నటికీ కావు.

శ్రీ పి. సుందరయ్య :- మహా మేధావులకు ఆ రకంగానే కనబడవచ్చు గాని, మాబోటి సామాన్యులకు అవి కో-అపరేటివ్స్‌గానే కనబడుచున్నవి. వారికున్నంత మేధా సంపత్తి మాకు లేదు గాబట్టి, మాకు వేరు అర్థం కనబడలేదు.

మిస్టర్ స్పీకర్:- అయితే, అక్కడ రెండూ ఉన్నవి కాబోలు. కో-ఆపరేటివ్స్ కలెక్టివ్స్‌గా మారినట్లున్నాయనుకుంటాను.

శ్రీ పి. తిమ్మారెడ్డి:- ఇంటర్‌నేషనల్ సిద్ధాంతవాదులు చెప్పవలెనేగాని, పల్లెలనుండి వచ్చిన నాబోటి సామాన్యులకు తెలియదు.

శ్రీ పి. సత్యనారాయణ (సామర్లకోట):- శ్రీ యం. ఎ. కృష్ణప్పగారి రిపోర్టును మంత్రిగారు వ్యతిరేకిస్తున్నారా ?

శ్రీ పి. తిమ్మారెడ్డి: శ్రీ కృష్ణప్పగారి రిపోర్టు ఉన్నది, శ్రీ ఆర్.కె.పటేల్ గారి రిపోర్టు ఉన్నది. అనుభవం ఆధారంగా లేని ఏ రిపోర్టునైనా వ్యతిరేకించవలసి వచ్చినప్పుడు వ్యతిరేకించవలసినదే. పెద్దవారెవరో చెప్పినారు కాబట్టి, దానిని గుడ్డిగా ఒప్పుకోవడం అంత మంచిది కాదు. అది డెమోక్రసీ ఉద్దేశం కాదు, మా కాంగ్రెసు ఉద్దేశం కాదు అని మనవి చేస్తున్నాను. ఎంత పెద్దమనిషి చెప్పినప్పటికికూడా లోపాలున్నట్లయితే యిది లోపం అని చెప్పడానికి చేతకాకుంటే అది ప్రజా ప్రభుత్వమని అనిపించుకోదు. భూమి: అనేది వ్యక్తికి లేకుండా వుండాలనే ఉద్దేశంతో కమ్యూనిస్టు పార్టీవారు చేయదలచుకుంటే ఆ ఉద్దేశాన్ని బయట పెట్టడం మంచిది. భూమిమీద పండేపంటకు సక్రమమైన ధర రావాలి. కూలీకి సరియైన కూలి రావడం లేదని ఒకవైపున చెబుతూ, యింకొక పంక రైతుకు గిట్టుబాటు ధరయైనా రానక్కర లేదని అనడంలో అర్థంలేదు-ఈరెండు సిద్ధాంతాలు ఒకదానికొకటి విరుద్ధమని మనవి చేస్తున్నాను. కావలెనన్నట్లయితే, మనం గ్రామాలకు పోదాం. ఎవరంతట వారు విచారణ చేయవచ్చు.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం):- ఏ గ్రామానికి, ఏ తారీఖున వెళదామంటారో చెబితే నేనుకూడా వస్తాను. భూస్వాములు వారి వైపు, ప్రజలు నా వైపు.

శ్రీ పి. తిమ్మారెడ్డి:- భూస్వాములందరూ నా వైపు ఉన్నట్లయితే, కష్ట సుఖాలు తెలిసేవి. ఆ విధంగా ఉండకపోవడం వల్లనే యీ యిబ్బంది వస్తున్నది. భూస్వాములనేవారిలో వివాదాలు లేకుండా ఉన్నట్లయితే ఎవరి కథ వారికి తెలుస్తుంది. ఆ పరిస్థితులు యీ దేశంలో లేవు కాబట్టి యీ యిబ్బందులు వస్తున్నాయి.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:- ఆ కాంట్రడిక్షన్ ఎప్పుడూ ఉండనే ఉంటుంది.

మిస్టర్ స్పీకర్:- ప్రతి ఒక్కరూ యీ విధంగా యింటరప్ట్ చేయడం మంచిదిగాదు. ప్రతిపక్ష నాయకులేమైనా చెప్పదలస్తే చెప్పవచ్చుగాని, ఎవరికి తోచినట్లు వారు చెబుతూవుంటే చర్చసాగడం కష్టం. తడవతడవకు అభ్యంతరాలు చెప్పవద్దని కోరుతున్నాను.

శ్రీ పి. తిమ్మారెడ్డి :- దేశంలో పేదవారనిపించుకొనే వారందరూ, బీద మాటలు మాట్లాడే వారిభావాలతోనే ఉంటారనుకోవడం పొరబాటు. రైతును గురించి ఇంతకాలం ఎవరూ పట్టించుకోలేదు. యుద్ధం వచ్చిన తరువాతనే వ్యవసాయ

To postpone the collection of Taccavi loan for next year in drought and no–rain areas.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by . . Rs. 100

To impress upon the Government to start the Rural University and Janata Colleges and Agricultural High and Middle Schools to educate the agriculturists in improved agriculture and Animal Husbandry and Fisheries.

*Mr. Speaker*: Motions moved.

*Shri G. Suryanarayana: (Gajapathinagaram–Reserved)* I beg to move.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

మార్కెటు ధరలు పెరుగుచున్నవి. ఇంతవరకు ధర తగ్గించి చౌక ధరలు నిర్ణయించడంలో ప్రభుత్వం అశ్రద్ధ చూపినందుకు.

*Mr. Speaker*: Motion moved.

*Sri Basava Maniah: (Andole)* I beg to move:

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

ఫెర్టిలైజర్సు ఆంధోలు తాలూకాలో యివ్వలేనందులకు, తాలూకాకై ఏ అధికారి లేనందులకు విమర్శించుటకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

ఆంధోలు తాలూకాలో అమ్మోనియం సంచులు 30 పౌండ్లు తక్కువ తూకం గలవి యిచ్చినందున సమయమునకు సప్లయి కానందున విమర్శించ గలందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

తక్కావి ఎరువులు ఒకరిపేర వ్రాయించి యింకొకరికి యిచ్చినందులకు.

*Mr. Speaker:* Motions moved.

*Shri Gopidi Ganga Reddy*: I beg to move:

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

విత్తనములను సకాలములో అందచేయలేనందుకు, మరియు ఎరువులు రైతులకు యివ్వలేనందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

సస్యాదుల రోగములను తెలుసుకో నందులకు, మరియు వాటికి ఔషధములు అందచేయనందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

అధిక ఆహారోత్పత్తి కొరకు బావులకు అప్పులు యిచ్చి అందులో అధిక ఆహారము పండించలేనందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,4J0 for Agriculture by Rs. 100

బోరింగు మిషన్లు మరియు ట్రాక్టర్లు బుల్‌డోజర్లను వ్యవసాయ రైతులకు కలుగజేయనందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

వ్యవసాయ శాస్త్ర పారశాలలు తాలుకాలో నియమించ నందులకు మరియు రైతులకు వ్యవసాయ ట్రైనింగు కృత్రిమ చూపినందులకు.

*Mr. Speaker*: Motions moved.

*Shri V. Visweswara Rao:* I beg to move:

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

To discuss the problem of introducing the Agricultural Wealth Tax in Andhra Pradesh.

*Mr. Speaker*: Motion moved.

*Sri B. Narasimha Reddy*: (*Suryapeta–General*) I beg to move:

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

నూతన బడ్జెటులో సూర్యాపేటలో నిర్మించవలసిన కృషి విద్యాలయానికి డబ్బు కేటాయించడం గురించి.

*Mr. Speaker* : Motion moved.

*Sri K. Rajamallu*: I beg to move:

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

To discuss the ineffective policy of the Government with regard to taccavi lands etc.

*Mr. Speaker*: Motion moved

*Sri M. Nagi Reddy:* I beg to move:

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

ఆంధ్రప్రదేశ్ ప్రజలకు కావలసిన తిండిగింజలను వారికి అందుబాటులో ఉన్న ధరలకు చౌకడిపోల ద్వారానైనా అందజేయనందులకు ప్రతి తాలూకా కేంద్రం లోను అన్ని రకాల మేలు విత్తనాల సప్లయి డిపోలను ప్రభుత్వం స్థాపించి అవనులో సప్లయి చేయుటకు ప్రభుత్వం పూనుకోనందులకు, రైతులకు ఎరువుల అప్పులు సకాలంలో అందే ఏర్పాటు చేయనందులకు, కృత్రిమ ఎరువులను సకాలంలో సప్లయి చేయనందులకు, రైతులకు కావలసిన వ్యవసాయ పనిముట్లను రైతులకు అందుబాటులో నున్న ధరలకు సప్లయిచేయుటకు ప్రభుత్వం పూనుకోనందులకు, రైతులకు కావలసిన ఆయిల్ యింజన్లు ఎలక్ట్రిక్ పంపుసెట్లు విరివిగాసప్లయి చేయనందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

రైతులకు కావలసిన సిమెంటు, ఇండ్లు కట్టుకొనుటకు అవసరమైన ఇనుప సామానులు కంట్రోలు ధరలకు రైతులకు అందజేయనందులకు.

*Mr. Speaker:* Motions moved.

*Shri Krishnamachary:* I beg to move

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

కనీసము ప్రతి తాలూకా కేంద్రములోనైనా సరైన సమయమునకు రైతులకు మంచి విత్తనములు సప్లయిచేయుటయందు ప్రభుత్వము విఫలమయినందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

ఎరువులు రైతులకు సులభముగా లభించునట్లు ఏర్పాట్లు చేయలేనందుకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

రైతులకు సరైన సమయములో ఋణములు యివ్వ లేనందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

పంటలకు వచ్చు రోగముల నివారణ గురించి ప్రభుత్వము తగు శ్రద్ధ వహించనందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

ఆహార ధాన్యముల ధరలను ప్రభుత్వము అదుపులో పెట్టజాలనందులకు.

*Mr. Speaker:* Motions moved

*108 (857) Sri Doddu Narsaiah*: I beg to move:

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

పైర్లకు అంటురోగాలు, క్రిమికీటకాదులు తగిలి నాశనమై పోతుంటే వ్యవసాయ శాఖ తగినంత మందులు సప్లయిచేసి పైర్లను కాపాడలేక పోతున్నందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

మిడతలదండు నుంచి పైర్లను కాపాడజాలక పోయినందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

రసాయనిక ఎరువులు కృత్రిమ ఎరువులు రైతులకు తరుణంమీద తగినంత సప్లయి చేయకపోవడం గురించి.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

వ్యవసాయ అభివృద్ధికి బావులు తీయించుట, మరమ్మతులు చేయుటకు తక్కావీ అప్పులు యిప్పించక పోవడం గురించి.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

మంచి విత్తనాలు, మందులుచల్లే యంత్రాలు ప్రజలకు సప్లయిచేయ గలిగేందుకు వీలుగా తాలూకా కేంద్రములో తగినన్ని ఉంచకపోవడం గురించి.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

వ్యవసాయ అభివృద్ధికి గాము నూతులకు కరెంటు అందుబాట్లోకి తెచ్చి ఆహారాభివృద్ధికి ఏమాత్రం కృషిచేయకపోవడం గురించి.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

రైతుల వ్యాపారపంటలకు తగినవిధంగా మార్కెటు సౌకర్యాలు కలిగించక పోవడం గురించి మార్కెటింగు కమిటీలను తెలంగాణాలో నెలకొల్పకపోవడం గురించి.

To reduce the allotment of Rs. 2,83,86,400 for Agriculture by Rs. 100

ఆహార ధాన్యాలకు స్థిరమయిన ధరలు నిర్ణయించి ప్రభుత్వము మార్కెటులోకి వచ్చి ధాన్యసేకరణకు పూనుకోనందులకు.

***Mr. Speaker***: Motions moved.

*Sri B. Sriramamurthy*: I beg to move :

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

రైతులకు సకాలంలో రసాయనిక ఎరువులు అందచేయనందుననూ, మేలురకం విత్తనాలు, తక్కావి ఋణాలు విరివిగా యిచ్చి వ్యవసాయ విధానంలోనూ, ఉత్పత్తిని పెంచుటలోను అభివృద్ధి సాధించలేక పోయినందులకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

నూర్పులకాలంలో రైతులు అమ్మకం చేయు సమయాన ఆహార దినుసులు ధరలు తక్కువస్థాయిలో ఉండి, రైతు చెయ్యిదాటిన తర్వాత, హార్వెస్టు సీజన్ను అనంతరం ధరలు మిన్నుముట్టుటవలన, యిటు సామాన్యరైతు, అటు మధ్య తరగతి కుటుంబీకుడు యిభువురు బాధపడుతున్న పరిస్థితులను అరికట్టి ముందుగానే సరసమైన ధరలు ప్రభుత్వం నిర్ణయించనందున.

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

To discuss the failure of the Government to implement the report of the Sugarcane Committee (T. N. Venkatasubbareddy Committee)

*Mr. Speaker*: Motions moved.

*Sri K. Jaganmohan Reddy*: I beg to move:

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

పర్గి తాలూకాలో ఎరువులు సరియైన విధంగా వారి అవసరమైనంత సరఫరా చేయనందుకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

నవీన పద్ధతి పరికరములను పర్గితాలూకాలో పంపి సేద్యము అభివృద్ధి చేయుటకు రైతులను ప్రోత్సహించ నందుకు.

To reduce the allotment of Rs. 2,83,86,400 for
Agriculture by Rs. 100

ఎరువుల సరఫరా నిమిత్తం లారీలకు అధిక కిరాయిలు యిచ్చుటవలన కలుగు నష్టము వల్ల.

*Mr. Speaker*: Motions moved.

*Sri K. L. Narsimharao*: I beg to move.

To reduce the allotment of Rs. 2,83,86,400/- for
Agriculture by Rs. 100

వ్యవసాయ డిపార్టుమెంటులో జరుగుతున్న అక్రిమాల గురించి రైతులకు శాస్త్రీయ పద్ధతులను బోధించడంలో విఫలత గురించి, ఎరువులు, విత్తనాలు సకాలంలో అందించలేక పోవడం గురించి, మీస్సేదారులకు, షిక్మీదారులకు ఎరువులు విత్తనాలు అప్పివ్వటంలో కల్పింపబడిన ఆటంకాలను గురించి యీ శాఖకు ఎక్కువ ధనం కేటాయించకపోవడం గురించి.

*Mr. Speaker* : Motion moved.

## *Demand No. XXI. Fisheries Rs. 25,41, 900*

*Sri K. Jaganmohanreddy* : I beg to move

To reduce the allotment of Rs. 25,41,900/ for Fisheries by Rs. 100

To impress upon the Government to start one year course in Fisheries and educate on improved methods to the Fisheries Communities.

*Mr. Speaker* : Motion moved.

*Sri Gopidi Gangareddy* : I beg to move.

To reduce the allotment of Rs. 25,41,900/- for Fisheries by Rs. 100

మత్స్యములను పోషించి ఇతరదేశముల మత్స్యములను తెచ్చి ప్రకృతి విరుద్ధముగా పెంచుచూ ఆరోగ్యము మరియు పైసలు నష్టపరచి నందులకు.

To reduce the allotment of Rs. 25,41,900 for Fisheries by Rs. 100

పల్లెటూరి వాండ్ల మత్స్యాహారమును అపహరించుకొని పట్టణములో వారికి కలుగ చేసినందుకు.

*Mr. Speaker :* Motions moved.

*Sri M. Nagireddy* : I beg to move

To reduce the allotment of Rs. 25,41,900/- for Fisheries by Rs. 100

మత్స్య పరిశ్రమ అభివృద్ధి విషయంలో ప్రభుత్వం తగు శ్రద్ధ చూపనందులకు పల్లెకారులకు కావలసిన నూలు వగైరాలు చౌకగా సప్లయి చేయుటకున్నూ తగు ఆర్థిక సహాయం చేయుటకున్నూ పూనుకోనందులకు ఒకేవలను ఉపయోగించి చేపలు పట్టుకొనే పల్లెకారులపై పల్లెకారుల సంఖ్యను బట్టి అందరివద్ద వలపన్నును వసూలు చేస్తున్నందులకు, నవీన పద్ధతులలో మత్స్య పరిశ్రమను అభివృద్ధి చేయుటకు ప్రభుత్వం తగు కృషి చేయనందులకు.

*Mr. Speaker ;* Motion moved,

*Sri Krishnamachari* : I beg to move·

To reduce the allotment of Rs. 25,41,900/- for Fisheries by Rs. 100

జిల్లా అధికారులు మత్స్య సంపదను వేలము వేయుటలో జరుపుచున్న అవక తవకల విమర్శించుటకు.

*Mr. Speaker* : Motion moved.

*Sri B. Dharmabhiksham (Nakrekal);* I beg to move

To reduce the allotment of Rs. 25,41,900/- for Fisheries by Rs. 100

ఫిషరీస్ శాఖ మత్స్య పారిశ్రామికులకు సహకార సంఘాల ద్వారా చెరువులు గుత్తల కిచ్చి, మత్స్యపరిశ్రమను అభివృద్ధిచేయుటలో, కార్మికులకు వృత్తి కల్పించు టలో విఫలత జెందుట గురించి చర్చించుటకుగాను.

*Mr. Speaker :* Motion moved.

### *Demand No. XXII Veterinery Rs. 94,23,500/-*

*Sri K. Jaganmohan Reddy* : I beg to move:

To reduce the allotment of Rs. 94,23,500/- for Veterinary by Rs. 100

To impress upon the the Government to start one year refreshery course in Animal Husbandry to the qualified compounders so as to equip the Rural Veterinary Dispensaries with these trained persons to meet the need caused by the dearth of Veterinary Assistants.

*Mr. Speaker* : Motion moved.

*Sri Gopidi GangaReddy* : I beg to move:

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

పశువుల వీర్యమును యంత్రముద్వారా గర్భమున కలుగజేసే అక్రమ విధా నాన్ని అమలు పరచి నందులకు.

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

విగ్రహారాధనమునందు పశుబలి యిచ్చే విధానమును అపుదల చేయలేనందుకు, పశువులను హింసించే కర్తలను ఆపుదల చేయలేనందుకు.

*Mr. Speaker* : Motions moved.

*Sri Basavamanaiah*: I beg to move:

To reduce the allotment of Ls. 94,23,500 for Veterinary by Rs. 100

ఆంధ్రప్రదేశ్ అయిన తర్వాత ఆందోలు తాలూకాలో డాక్టరు లేని పశువైద్య శాలను నడుపు విధానమును విమర్శించగలందులకు.

*Mr. Speaker*: Motion moved.

*Sri Gopidi Ganga Reddy*: I beg to move.

To reduce the allotment of Rs. 94,23,500 foı Veterinary by Rs. 100

పశువుల రోగములను దినదినము వృద్ధిపొందుచుండగ చూచి అపుదలచేయ నందులకు.

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

పశు వైద్యశాలలు ఎక్కువగా స్థాపించలేని అసమర్థతను గురించి చర్చించు టకు.

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

వి_త్తన పశువులను ఏ స్థలములో ఉండేవాటిని ఆ స్థలములోనే వృద్ధిపొందేటట్లు చూడక ప్రకృతివిరుద్ధముగా యితరదేశాల వి_త్తనము పశువులను తెచ్చి పశుకులమును సంపూర్ణముగ బలహీనత, మరియు నాశన పరచినందులకు.

*Mr. Speaker*: Motions moved.

*Sri M. Nagi Reddi*: I beg to move·

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

పశు వైద్యకశాశాలను బాపట్ల నుంచి మార్పు చేస్తున్నందులకు,

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

నెల్లూరు జిల్లా హెడ్ క్వార్టరు పశువైద్యశాలకు మందులకు తగినంత డబ్బు కేటాయించనందులకు.

*Mr. Speaker*: Motions moved:

*Shri K. Rajamallu*: I beg to move:

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

To discuss the functioning of District Veterinary Department.

*Mr. Speaker* : Motion moved.

*Sri Krishnamachari* : I beg to move.

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

సంగారెడ్డి, మెదకుజిల్లా ముఖ్యస్థాన మయినను యింతవరకు పశువైద్యశాలకై భవనము కట్టించనందులకు.

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

పశువుల రోగ నివారణకై కనీసము ప్రతి తాలూకా హెడ్‌క్వార్టరులో పశు వైద్యశాలలు ఏర్పాటు చేయనందులకు.

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

జోగిపేట తాలూకా ఆంధోలులో యింతవరకు వెటర్నరీ అసిస్టెంటును నియమించ నందులకు.

*Mr. Speaker* : Motions moved.

*Sri D. Narasaiah* : I beg to move :

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

పశువులకు ప్రతి ఏటా వచ్చే అంటువ్యాధులను రాకుండా నివారించుటకు తగిన శ్రద్ధ కనపరచక పోవడం గురించి.

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

కనీసం ప్రతి ఫిర్కా కేంద్రమునకు ఒకటి చొప్పున పశువుల వైద్యశాలలు ఏర్పాటు చేయడం గురించి.

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

ఉత్తమజాతి పశుసంతతిని అభివృద్ధి చేయుటకు ఆబోతు ఎద్దులను గ్రామ పంచాయతీల అజమాయిషీలో ఉంచుటకు పూనుకోక పోవడం గురించి.

To reduce the allotment of Rs. 94,23,500 for Veterinary by Rs. 100

మేతకొరత ఏర్పడ్డ ప్రదేశాలకు గడ్డి డిపోలను నెలకొల్పి ఆదుకోక పోవడం గురించి.

*Mr. Speaker* : Motions moved.

ఆంధోలుతాలూకాలో జొన్న, వరి ముఖ్యమైన పంటల ప్రగతి పరిశోధనా కేంద్రములు నెలకొల్పలేనట్టి ప్రభుత్వ విధానమును విమర్శించుట

*Mr. Speaker* : Motion moved.

*Demand No. XLIX–Capital Outlay of State Schemes of Government Trading Rs. 5,50,43,700.*

*Sri K. Jaganmohan Reddy* : I beg to move :

To reduce the allotment of Rs. 5,50,43,700 for Capital Outlay of State Schemes of Government Trading by Rs. 100

To criticise the attitude of the Government in running the State Schemes in Government Trading as they were either mismanaged or running in loss.

*Mr. Speaker :* Motion moved.

*Sri P. Satyanarayana :* I beg to move.

To reduce the allotment of Rs. 5,50,43,700 for Capital Outlay on State Schemes of Government Trading by Rs. 100

చేనేత వస్త్ర ఉత్పత్తిని స్టేట్ గవర్నమెంటు ట్రేడింగ్ ద్వారా విడుదల చేయవలసిన అవసరాన్ని ప్రభుత్వానికి నచ్చచెప్పుటకు.

*Mr. Speaker :* Motion moved

*Sri Gopidi Ganga Reddy* : I beg to move :

To reduce the allotment of Rs. 5,50,43,700 for Capital Outlay on State Schemes of Government Trading by Rs. 100

ధాన్యముల చౌకడిపోలు తెరవనందులకు.

*Mr. Speaker :* Motion moved:

*Sri Basava Manaiah* : I beg to move:

To reduce the allotment of Rs. 5,50,43,700 for Capital Outlay on State Schemes of Government Trading by Rs. 100

దివాలా తీసిన సివిల్ సప్లయి వారికి 7,75,000 కేటాయించిన ప్రభుత్వ విధానమును ఖండించ.

*Mr. Speaker :* Motion moved:

*Sri Gopidi Ganga Reddy* : I beg to move :

To reduce the allotment of Rs. 5,50,43,700 for Capital Outlay on State Schems of Government Trading by Rs. 100

కవులనివిదవలపమొంచి ప్రాజక్టు నిర్మల్, ముథోల్ తాలూకాలకు యివ్వ నందులకు.

*Mr. Speaker* : Motion moved.

శ్రీ వి. విశ్వేశ్వరరావు:- అధ్యక్షా, ఈ డిమాండ్లను ప్రతిపాదిస్తూ గౌరవ నీయులైన మంత్రిగారు చాలా విషయాలు చెప్పారు మంత్రిగారు తమ ఉప న్యాసము ప్రారంభంలోనే ఆహారధాన్యాల విషయంలో రైతుల ఇబ్బందులు గురించి మాట్లాడుతూ చాలా విషయాలు చెప్పారు. మంత్రిగారు "రైతులు" అని అన్న ప్పుడు మంత్రిగారి రైతులు ఎవరో, నా రైతులు ఎవరో చూస్తే యీ రెండురకాల రైతుల మధ్యా చాలా వ్యత్యాసాలు ఉన్నట్లుమనకు తెలుస్తుంది. మంత్రిగారు చెప్పేరైతులు గ్రామాలలో చాలా తక్కువమంది వున్నారు. మంత్రిగారు చెప్పే రైతులు గ్రామాలలో నూటికి ఎనభైమంది లేరు. ఈనాడు గ్రామసీమల్లో నూటికి ఎనభైమమంది ఉన్న రైతులయొక్క కష్టసుఖాలు ఏమిటో, బాగోగులో ఏమిటో మనం ప్రధానంగా చూడవలసి ఉన్నది. గ్రామాలలో నూటికి 80 మంది రైతులు చాలీ చాలని దోసెడు నీళ్ళతో చారెడునేలలో పంట పండించటానికి ప్రయత్నం చేస్తున్నారు. ఈ ప్రభుత్వం, వారికి కావలసిన సదుపాయాలు చేయటం లేదని నేను పదే పదే చెప్పటం జరిగింది. ఈనాడు గ్రామాల్లోని పేద రైతాంగం పంటలు పండించుకోటానికి ఎంతో ఉత్సాహం చూపిస్తున్నారు. కాని ప్రభుత్వం వ్యవసాయాభి వృద్ధి చేయటానికి ఏమి రిసర్చి చేస్తోందో బోధపడదు. గత సంవత్సరం యీ ప్రభుత్వం ఎగ్రికల్చరల్ రిసర్చికొరకు 86 లక్షల 64 వేలు ఖర్చు పెట్టటానికి బడ్జె టులో చూపించారు. కాని 54 లక్షలు మాత్రమే ఎగ్రికల్చరల్ రిసర్చి కొరకు ఖర్చుపెట్టారు. అందులో 30 లక్షలు మిగిల్చారు. పంటలు పండటంలేదు. పంటలు సంవత్సరం సంవత్సరానికి తగ్గిపోతున్నాయనేది మనం అనేక సందర్భాలలో వింటున్నాము. ప్రత్యేకించి డెల్టాప్రాంతంలో యీ సంవత్సరం ఎకరానికి రెండు బస్తాలు మూడు బస్తాలు మాత్రమే పండిన గ్రామాలు ఉన్నాయి, దానికి కారణం రైతుయొక్క లోపంకాదు. ఎకరానికి వందరూపాయల ఎరువులు వాడిన రైతులు ఉన్నారు. ఎరువులేకాదు, అనేక మందులు కూడ రైతులు వాడారు. కాని ఎకరానికి రెండుమూడు బస్తాలు మాత్రమే పండాయి. దీనికి కారణం ఏమిటంటే పంటకు అనేక తెగుళ్ళు వస్తున్నాయి. "ఆ తెగుళ్ళకు మందులు ఏమిటి, వాటిని వకాలంలో ఎలా ఎదుర్కోవాలి, వాటిని ఎట్లా నశింపజేయాలి" అన్నదానిని గురించి ప్రభుత్వం రిసర్చిచేసి, ఆలోచించి, రైతులకు సహాయం చేస్తున్నదా అంటే లేదు.

అనేక గ్రామాలలో ప్రజలు ప్రభుత్వం ఎడల, ప్రభుత్వ ఉద్యోగస్థుల ఎడల, వ్యవసాయశాఖ ఎడల చాలా ఉదాసీనంగా ఉంటున్నారు. ప్రభుత్వం చెబుతున్న దానికి చేస్తున్నదానికి చాలా తేడా ఉంటున్నది. ప్రభుత్వం చెప్పేవిషయాలు ఆచరణలో చేయటం లేదనేది మనకు స్పష్టంగా కనుపిస్తోంది. ప్రభుత్వం ఫారమ్సు పెడుతోంది. రైతులు పండించే పంటకన్నా తక్కువ పంట ప్రభుత్వ ఫారమ్సులో పండుతున్నది. మన రాష్ట్రంలో ప్రజానీకం తినటానికి తిండి ఉన్నా లేకపోయినా 'మిగులు' అన్న పేరుతో 5 లక్షల టన్నుల ధాన్యాన్ని ఎగుమతి చేయటానికి సౌకర్యాలు కల్పిస్తున్నారు. ఆవిధంగా మన రాష్ట్రంలోని ధాన్యాన్ని ఎగుమతి చేయటానికి ప్రయత్నం జరుగుతున్నది. అవసరంగా ధాన్యం పండించే రైతాంగానికి సదుపాయాలు చేయటానికి యీ ప్రభుత్వం ప్రయత్నిస్తోందా అంటే లేదు అని స్పష్టంగా చెప్పవలసి ఉన్నది. రైతులు తమకు కావలసిన పంట పండించుకోటానికి సకాలంలో నాట్లువేసుకునేందుకు సౌకర్యాలు కలుగజేయాలని, పంటలకువచ్చే తెగుళ్ళను పోగొట్టటానికి మందులు కావాలని కోరుతున్నారు. రైతులగురించి శ్రద్ధ తీసుకోవటానికి ప్రభుత్వం ఏమాత్రం ప్రయత్నించటం లేదు. ప్రభుత్వం రైతుల యొక్క ఆలనాపాలనా కనుక్కోవటంలేదు. ఎగ్రికల్చరల్ రిసర్చి విషయంలో ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవటం లేదు. ఆముదాలకు ప్రత్యేకంగా రిసర్చి జరపటానికి ప్రయత్నిస్తున్నామని మంత్రిగారు చెప్పారు. ఆముదాలకు ప్రత్యేకించి రిసర్చి చేయటం కొరకు లక్ష, 50 వేల రూపాయలు కేటాయించారు. లక్ష 50 వేలతో ఆముదాలకు రిసర్చి ప్రారంభించ బోతున్నందుకు సంతోషం. అదేవిధంగా యీనాడు ఇంకా ఎక్కువగా ఎగ్రికల్చరల్ రిసర్చి చేయవలసి ఉన్నది.

ఈనాడు కొంతమంది ఆహారధాన్యాల ధరలు తగ్గాలంటున్నారు. మంత్రిగారు ధరలు ఎక్కువగా ఉండాలంటున్నారు. రైతుకు గిట్టుబాటైన ధర ఉండాలని వారు అంటున్నారు. అసలు రైతుకు గిట్టుబాటయ్యే ధర అంటే ఏమిటి? గిట్టుబాటు అన్నదీ ఎలా నిర్ణయిస్తారు? వ్యవసాయంమీద ఎంత ఆదాయం వస్తుంది. వ్యవసాయ ఖర్చులు ఎంత అవుతున్నది అని లెక్క వేసుకొని, చూడాలి. ఆ గిట్టుబాటు అన్నది ఏ రూపంలో ఉండాలన్నది చూడాలి.

పంట మార్పుల కాలంలో రైతుకు సక్రమమైన, న్యాయమైన ధరలు రావాలని అందుకు తగిన చర్యలు ప్రభుత్వం తీసుకోవాలని ప్రతివారు కోరుతున్నారు. అదే విషయాన్ని మెహతా కమిటీ చెప్పింది. కాని ప్రభుత్వం అందుకు చర్యలు తీసుకోవటం లేదు. వేరుసెనగ విషయంలోగాని, ఆముదాల విషయంలోగాని, లేక ఇతర వ్యాపారపంటల విషయంలోగాని పంటల మార్పులు కాలంలో ధరలు నిర్ణయించకుండా, మార్పుల కాలంలో ఎగుమతుల కోటాలు నిర్ణయించకుండా పంట అంతా వ్యాపారస్థుల చేతులలోకి పోయిన తర్వాత, ప్రభుత్వం ధరలు నిర్ణయించి

ఎగుమతి సౌకర్యాలు కలుగజేసినందువల్ల ప్రజలకు రైతులకు వచ్చే లాభం ఏమిటని మంత్రిగారిని ప్రశ్నిస్తున్నాను. ఈనాడు ఆహారపదార్థాల ధరల విషయం చూసినపుడు నూర్పుల కాలంలోనే ప్రభుత్వం ధరలు నిర్ణయిస్తోందా అంటే లేదు "పంటలకు ఎంత ధర ఉండాలి, ఏది న్యాయమైన ధర" అని ఆలోచించి నూర్పుల కాలంలోనే సక్రమమైన ధరలు నిర్ణయించటానికి యీ ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవటంలేదు. ఈ పంటకు మినిమమ్ ప్రయిసెస్ నిర్ణయించిందా అంటే లేదు. రైతులను వ్యాపారస్థుల దయాదాక్షిణ్యాలపైన విడిచిపెడుతున్నారు. రైతు తనకు పండిన పంటలో కొంత భాగం అమ్మి గవర్నమెంటుకు శిస్తులు కట్టాలి. ఎరువులకుగాను తీసుకొన్న అప్పు వడ్డీతో సహా కట్టాలి. అంతేగాకుండా బయట వ్యాపారస్థుల దగ్గర తీసుకొన్న అప్పులు కట్టాలి. రైతుకు పంట చేతికి రాగానే అప్పులవాళ్ళంతా వచ్చి కూర్చుంటారు. తన పంటను అయినకాడికి అమ్మవలసిన అవసరం ఏర్పడుతుంది. రైతులు అటువంటి బాధలు యీనాడు పడుతున్నారు. రైతులను యీ బాధలనుండి రక్షించటానికి ప్రభుత్వమే న్యాయమైన ధరకు, రైతుకు గిట్టుబాటు అయ్యే ధరకు ధాన్యం కొని, నిల్వచేసి, వ్యాపారస్థులు ధరలు పెంచకుండా చేయాలి. కాబట్టి ప్రభుత్వం ముందుగానే రైతుకు గిట్టుబాటు అయిన ధర నిర్ణయించి. తానే స్వయంగా మార్కెట్‌లోకి వచ్చి రైతుల దగ్గరనుండి ధాన్యం కొనాలి. వ్యాపారస్థులు ధాన్యం ధరలు పెంచకుండా చూడాలి. ఈవిధంగా యీనాడు ప్రభుత్వం చేస్తోందాఅంటే లేదు. ప్రభుత్వం ఎప్పటికప్పుడు రైతులను మార్కెట్‌మీద వ్యాపారస్థుల దయాదాక్షిణ్యాలపైన వదలిపెట్టటం జరుగుతోంది. ఈ వ్యాపారపంటలు పండే తరుణములోనే మామూళ్ళ రోజులలోనే ధరలు నిర్ణయించి, ఆ ధరలకు ప్రభుత్వమే కొని, నిలవ చేసి, ఆ పంటలను ప్రజానీకానికి అందజేయ వలసిన అవసరం ఉన్నది. కాని ప్రభుత్వం ఇంతవరకు అందుకు చర్య తీసుకోలేదు. ప్రభుత్వం వెంటనే అందుకు చర్య తీసుకోవటానికి బాధ్యత వహించాలి. కాని మంత్రిగారు "ఆహారధాన్యాల ధరలు పెరగాలి, ఎవరి ఇష్టంవచ్చినట్లు వారు స్వేచ్ఛగా అమ్ముకోవచ్చును" అని చెప్పటం జరుగుతోంది. కాని, ఆచరణలో న్యాయమైన ధరలు నిర్ణయించి, ప్రభుత్వం రైతులనుండి ధాన్యం కొనకపోవటం వల్ల, యీనాడు రైతులకు రక్షణ కలగకుండా పోతోంది. ఆ విషయాన్ని ప్రభుత్వం గుర్తించ వలసి ఉన్నది. ప్రభుత్వం ధరలు నిర్ణయించే టప్పుడు యీనాడు ఉన్నటువంటి మార్కెట్‌ను అదుపులో పెట్ట వలసిన ఆవశ్యకత ఉన్నదని చెబుతున్నాను.

చౌకడిపోలవిషయముకూడ పదేపదే చర్చకు వస్తూన్నది. వీటియొక్క అవసరము ఉన్నదా, లేదా అనేది తీసుకుంటే ఈనాడు మన రాష్ట్రములో నూటికి ఎనభై మంది భూములమీద ఆధారపడి జీవిస్తున్నవారు ఉన్నారు. వీరందరూ గ్రామసీమలలోనే నివశిస్తున్నారు. కేవలము ప్రతిదినము కొని తినేవారు ఎంతమంది ఉంటారో

కూడ లెక్కవేయండి. వీరందరు కేవలము వ్యవసాయకూలిమీద ఆధారపడి జీవనము గడుపుకునేవారు. ఈనాడు ధాన్యానికి ధరలు పెరిగిన పరిస్థితులలో వారికివచ్చే కూలి డబ్బులు తిండికిచాలని పరిస్థితిలో చౌకడిపోలు లేకపోతే వీరిపరిస్థితి ఎట్లా? కూలిద్వారా వచ్చేడబ్బు చాలకపోతే పస్తులు పడుకోవలసిందేగదా ! కూలిమాత్రము ప్రతిదినము దొరుకుతుందని నమ్మకము ఏమి ? ఒకదినము కూలితో కొద్దిగా చౌకగావుండే ధాన్యము కొనుక్కొని, కూలి దొరకనిరోజున క్రితంరోజుమిగిలినది తింటూంటారు. హెచ్చుధరలువుంటే ఆడబ్బు వారికి చాలదుగనుగ చౌకడిపోలద్వారా లభించే ధాన్యము కొనుక్కొని జీవించడానికి వాళ్ళకు చౌకడిపోలు అవసరము అని నేను ప్రార్థిస్తున్నాను. కూలిరేటుకూడ రోజురోజుకు తగ్గిపోతున్నది. పల్లెసీమలలో కూలి డబ్బురూపములో యిస్తారు. సాధారణముగ ధాన్యము రూపములోవుండదు. ధాన్యము అయితే పరవాలేదు. ఏదోవిధముగ మిగుల్చుకొన్న డబ్బుతో వారికి చౌకగా ధాన్యము లభింపజేస్తే కొనుక్కొని తిని బ్రతుకుతారు. అందువల్ల చౌకడిపోలు రాష్ట్రమంతట ఏర్పాటుచేయాలని అంటున్నాను. ఇదివరలో రాయలసీమలో కరువుపరిస్థితులుంటున్నవి, అక్కడనుంచి కూలిజనము, పాటకజనము అందరు వలసవెళ్ళిపోతున్నారని మంత్రిగారే చెప్పారు. రాయలసీమలో కరువున్నదని వారే ఒప్పుకున్నారు. ఈమధ్య కొన్ని ప్రాంతాలలో పంటలులేని కారణముచేత ప్రభుత్వము రెమిషనుగూడ యిచ్చింది. రాయలసీమలో కరువు వున్నదని ఒప్పుకున్న సందర్భంలో మా ప్రాంతాలలోగూడ అదే పరిస్థితి వున్నదని చెబితే, "మీ ప్రాంతము డెల్టా ప్రాంతము, అది మిగులు ప్రాంతము, చౌకడిపోలు అక్కరలేదు" అనిఅన్నారు. చౌకడిపోలు పేదవాళ్ళు ఎక్కడఉన్నను ఆప్రాంతాలలో పెట్టించడము అవసరము. ఆవిధముగ అన్ని ప్రాంతాలలో పేదవాళ్లకోసము చౌకడిపోలు open చేస్తేనే ప్రజలకు ప్రభుత్వంమీద విశ్వాసము ఉండే అవకాశము ఉంటుంది. చౌకడిపోలు అవసరమని పట్టణములో నివశించే పేదవాళ్లుగాని, పంటలుపోయిన ప్రాంతాలవాళ్లుగాని కోరినప్పటికినీ, అవిఅన్నీ మిగులు ప్రాంతాలు, అయిదు లక్షల టన్నుల ధాన్యము అదనముగ వున్నది అని చెబుతూ, చౌకడిపోలు పెట్టించడానికి ప్రభుత్వము కాలయాపన చేస్తున్నది. సామాన్య జనానికి ఈధాన్యము అందుబాటులోవుండటానికి ప్రభుత్వము తీసుకున్నచర్య ఏమీ లేదు. పంటలు పండించేవారికి అవసరమైతే subsidy యివ్వాలని, యింకాదానికి తగిన పత్తాసి, ప్రోత్సాహముకూడ యివ్వవలసి ఉంటుందని మంత్రిగారే చెప్పారు. పోనీ అలాంటివారికి అయిథా subsidy యివ్వాలని అంటున్నాను. పంచవర్ష ప్రణాళిక క్రింద కార్యక్రమాలకు డబ్బు చాలడములేదు అని ఒక ప్రక్కన చెబుతూ, విదేశములకు ఎగుమతి చేయటానికి మార్కెటు గిరాకీలేదని చెబుతూ, ఆహారధాన్యాలను విదేశములనుంచి దిగుమతి చేయటానికి ప్రభుత్వము కోట్లకొలది రూపాయలు ఖర్చు చేస్తున్నది. ఈవిధముగ విదేశములలో పండే ఆహారధాన్యములకు కొట్లకొలది రూపా

యలు ప్రభుత్వము ఖర్చు చేసేబదులు, ఆడబ్బు మనదేశములోనే రైతాంగానికి సహాయముచేస్తే, ఆ దిగుమతిచేయ నిర్ణయించిన ధాన్యము ఇక్కడనే పండించటానికి వీలు అవుతుందిగదా! ప్రభుత్వము ఆవిధముగ ఎందుకుచేయకూడదు? రాష్ట్రములో ఏ నియోజకవర్గములో చూచిననూ ఈ ఆహారధాన్యాల సమస్య, గ్రామసీమలలోని పరిస్థితులదృష్ట్యా, చర్చకు రాకమానడములేదు. ఇటీవలనే గౌహాతీ కాంగ్రెసు జరిగినప్పుడుకూడ ఈ విషయం చర్చకు వచ్చినట్లు పత్రికలలో మనమందరము చదివియున్నాము. ఈనాడు ప్లానింగు కార్యక్రమములు దిగ్విజయముగ అమలుజరపాలంటే ముందు అధికాహారోత్పత్తికి ప్రాముఖ్యత నివ్వాలని అన్నారు. అధికముగ ఆహారధాన్యాలు పండించటానికి తగిన చర్యలు తీసుకోవాలని చెబుతున్నారు. ఈనాడు మన దేశములో పండే పంటలు 30, 40 పరసెంటు ఎక్కువ కావాలి అని ప్లానింగు కమిషనువారు ఉద్దేశిస్తున్నారు. ఆవిధముగ అధికపంటలు పండించటానికి తగినచర్యలు తీసుకోవాలని అన్నారు. దీన్ని అమలు జరపటానికి ప్రభుత్వము తీసుకున్న చర్యలు చాలా తక్కువనే చెప్పవలసిఉంటుంది. ముఖ్యమైనది ధాన్యపు ధరల కంట్రోలు సమస్య. దీనిని నిర్ణయించే బాధ్యత ప్రభుత్వంమీదనే ఉన్నదని చెప్పకతప్పదు. అధికాహారోత్పత్తి జరగాలంటే విదేశమునుండి ఆహారధాన్యాలు దిగుమతి చేసుకొనే బదులు మన రాష్ట్రములో ఎన్నో మార్గాలులేవా? మన రాష్ట్రములో బంజరుభూములు లక్షలకొలది ఎకరాలు ఊరకనే పడివున్నవి. వ్యవసాయ మంత్రిగారే అటవీశాఖను కూడ చూస్తున్నారు. లంకలలో బంజరుభూములున్నవి. అనేకచోట్లలో అడవులలో వున్నవి. ఇంకా అవి అనేకరూపములలో వున్నవి. ఈ భూములన్నీ సాగులోనికి తీసుకురావటానికి ప్రభుత్వంచేసే పని ఏమిటి? వీటిని బంజర్లుగా ఎందుకుఉంచాలి? ఎక్కడైనా పేదవాళ్ళు పొట్టకు జరగక బంజరుభూములు సాగుచేసి పంటలు పండిస్తూంటే వాటిపైన 20 రెట్లు penalties విధించి వసూలుచేస్తున్నారు. భూములనుండి వెళ్ళగొట్టుచున్నారు. ఈ భూములన్నింటినీ సాగుకుతెస్తే మనకు విదేశములనుంచి ఆహారధాన్యాలు తెప్పించుకోవలసిన అవసరము ఎందుకువస్తుంది? ప్రభుత్వము అలాంటి సాగుచేసేవారిని ప్రోత్సహించేబదులు heavy penalties వేసి బాధిస్తున్నది. ఈవిషయాలన్నీ ప్రభుత్వము దృష్టికి తేలేదా? పెనాల్టీలను తీసివేయించండి అని విజ్ఞప్తులు చేయలేదా? ప్రభుత్వం ఈ పేదవాళ్ళకు ఏవిధముగ సహాయము చేయగలగనుద్దేశిస్తున్నది. ఈవిధముగ heavy penalties విధించడము ఒక్క మా కృష్ణా జిల్లాలోనేకాదు. తెలంగాణాలోకూడ అదేప్రకారము జరుగుతున్నది. వేలకొలది, లక్షలకొలది ఎకరాల బంజరుభూములు ఖాళీగావుంటున్నవి. అనేకమంది సాగుచేయాలని ప్రయత్నము చేస్తున్నారుకాని ప్రయోజనము పొందనివ్వడములేదు. ఈవిధముగ చేస్తే అధిక ఉత్పత్తి ఏవిధముగ జరుగుతుందని ప్రభుత్వము అనుకుంటున్నది? Heavy penalties వేయకుండా అన్నిచోట్లలో వసూలుచేసినట్లే శిస్తువసూలుచేస్తే ఉత్పత్తి ఎందువల్ల పెరగదు?

*( Sri S. Ranganadha Mudaliar in the Chair )*

ఈ సందర్భములో మరొక విషయము మంత్రిగారి దృష్టికి తేవలసియున్నది. పంటలు అధికముగ పండించటానికి రైతులకు కావలసినమటుకు నీరు సరఫరా చేయాల్సిందేనని మంత్రిగారే అన్నారు. మనము పెద్ద పెద్ద ప్రాజెక్టులు కట్టాలని ప్రజలు కోరుతున్నారేకాని, కేవలం వీటివల్ల యీ ఆహారసమస్యతీరదు, చిన్న చిన్న ప్రాజెక్టులుకూడ కట్టడముకూడా అవసరమేనని మంత్రిగారే అన్నారు. నేను మంత్రిగారి దృష్టికి మా కృష్ణా జిల్లాలో జరిగిన విషయము తీసుకుని రాదలచాను. కృష్ణాజిల్లాలోని గన్నవరం తాలూకాలో మెట్టపల్లి అనే గ్రామమున్నది. ఆగ్రామానికి సగ్గురుఅమీన్ చెరువు అని ఉన్నది, అది చాలా పెద్ద చెరువు. దాని క్రింద సుమారు అయిదు వేల ఎకరాలు సాగు అవుతున్నది. దాని చరిత్ర చెప్పాలంటే, దానికి నూరు సంవత్సరముల చరిత్ర వున్నది. అది బహుశ నూరు సంవత్సరములకు ముందునుంచే అది ఈ భూమికి నీరు అందిస్తున్నదని అంటారు. ఎప్పుడో ఒక్కప్పుడు యీ చెరువులోని నీరు వల్ల సుమారు నూట యాభై ఎకరాలకు ముంపు వస్తుందని, రైతులకు పంట నష్టమువస్తున్నదని విజ్ఞప్తులు ప్రభుత్వానికి వచ్చినంత మాత్రాన, ఆ చెరువుకు గండి కొట్టించి, మురుగుకాలవల ద్వారా చెరువులోని నీటిని బైటకు పంపివేయటానికి ఈ ప్రభుత్వము ఉత్తరువులు ఇచ్చింది. పైగా రైతులు గండి పూడ్చుతారేమోనని అక్కడ పోలీసు కాపలా పెట్టబడింది. దానిని supervise చేయటానికి ఒక డిప్యూటి కలెక్టరును, ఆయనకు సహాయముగ ఒక తహశీల్దారును వేసి చెరువును కాపలా కాయిస్తున్నది. అక్కడ పండే ధాన్యము చాలా బలమునిచ్చే ధాన్యమని, తెలివి తేటలు వృద్ధి అవుతాయని ప్రజలు అనుకుంటారు. మొలకొలుకులుకూడ పండేచోటు. మంచి రకపుధాన్యము పండుతుంది. ఇలాంటి గొప్ప ప్రాశస్త్యముగల చెరువును ప్రభుత్వము గండి కొట్టించడము అన్యాయమని ప్రజలు విజ్ఞప్తి చేస్తేకూడా ప్రభుత్వము ఆ గండి పూడ్పించలేదు. ఇలాంటి చర్య ప్రభుత్వము ఎందువల్ల తీసుకోవలసి వచ్చిందో నాకు అర్థము కావడములేదు. పోనీ ఆ చెరువుకు వున్న పూర్వపు చరిత్రను బట్టిగాని, రూల్సు నియమములను బట్టిగాని ఏమీ ఆలోచించకుండ గండి కొట్టడము జరిగింది. ఈ విషయము మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. ఇలాంటివి యింకా అనేక ఘటనలు చెప్పగలను. కైకలూరు తాలూకాలో తమ కాలువకు నీరు అందదని రైతులు వేరుశనగ పంట వేసుకున్నారు. దీనికి నిజమైన మూలకారణము ఏమిటంటే ప్రభుత్వము సకాలములో సరైన నిర్ణయాలు తీసుకోక పోవడము వల్లనేనని అంటున్నాను— అక్కడ దాల్వా పంటకు నీరు యిస్తూఉంటారు. ఒకసారి irrigation conference జరిగింది. అది ఆగస్టు నెలలో జరిగింది. ఈ confernce November నెలలో జరపండి. దానికి M.L.A. లను, రైతాంగాన్ని అందరిని పిలవండి. వారి వారి అభిప్రాయాలు

తీసుకోండి. దానిపైన ప్రభుత్వము నిర్ణయము చేయండి అని ప్రజలు కోరారు. ఇన్ని గ్రామాలకు నీరు యిస్తామని ముందుగా తేల్చి చెప్పండి అని నేనుగూడ కోరాను. అ విధముగ చేస్తామని చెప్పి, అధికారులు అందరు ఎవ్వరికీ తెలియకుండా ఒక conference జరిపారు. దానికి P.W.D. వారు Revenue Department వారుకూడ హాజరైనారు. మాకెవ్వరికీ తెలియదు. నవంబరు నెల మొదటి వారములో కొన్ని నిర్ణయాలు చేశారు. రెండవ వారములో కూడా చేశారు. ఇవి అన్నీ ఆఖరు అయిన తరువాత ఆఖరు నిమిషములో మీ కాలవకు నీరు యివ్వడము లేదని చెప్పారు. దాని మీదట ఆరు వందల ఎకరాలలో వేరుశనగ వేశారు, ఇంకా 60 ఎకరాలలో రెండవ పంటవేయటానికి సిద్ధముగ ఉన్నారు నవంబరు నెల దాటిపోయింది. డిశంబరు నెలలో 18, 19 వ తేదీలలో నలభై ఎకరాలకు మాత్రము నీరు యిస్తామని చెప్పారు. అప్పటికి ఆరు వందల ఎకరాలలో వేరుశనగ వేయడము అయిపోయింది. ఇక నీరు అవసరముండదు. ఇప్పుడు నీరు ఇస్తాము, మేము మా conference లో తీర్మానము చేశాము నీరు తీసుకుంటారా లేదా అని అంటే నీరు వదిలితే, ఆ వేరుశనగ పంట అంతా కుళ్ళిపోయి ఎందుకుకూడ పనికిరాకుండా పోతుంది. కలెక్టరువద్దకు వెళ్ళి చెబితే, మేము December 18, 19 వ తేదీలలోనే నిర్ణయము తీసుకున్నాము కాబట్టి నీరు తీసుకొని తీరవలసిందేనని ఆయన అన్నారు. రైతులు కోరినప్పుడు నీరు యివ్వక, ఎప్పుడో రెవిన్యూ అధికార్లకు యిష్టము వచ్చినప్పుడు నీరు యిస్తాముఅంటే, రైతులు నష్టపడక ఏమవుతారు? ఇదేదో పరిపాలనలోనే లోటు ఉందనుకుంటాను. ఈ విషయములో రైతులను నిర్ణయము తీసుకోక ముందు ఎందువల్ల సంప్రదించకూడదు? సంప్రదిస్తే, అందులో ఉండే కష్ట నిష్టూరములు ప్రభుత్వాధికార్లకు తెలియజేస్తారుగదా! కాబట్టి మీరు మాయిష్టము వచ్చిన పంటవేయండి " అని రైతులకు చెప్పేరోజులు వచ్చినట్లుగా కన్పిస్తున్నది. ప్రభుత్వము యొక్క యిలాంటి విధానము అధికాహారోత్పత్తికి తోడ్పడడముగా గాక ప్రజలను నిరుత్సాహ పరిచే విధానముగ కన్పిస్తున్నది.

ఇక పోతే ఎరువుల విషయము తీసుకోండి, ఎరువుల కొరకు farms చుట్టూ తిరుగవలసివస్తున్నది. ఆ ఎరువులు సకాలములో ఇవ్వరు. తరుణము దాటిపోయిన తరువాత యివ్వడము జరుగుతున్నది. ఈ విషయము ప్రభుత్వానికి అనేక సార్లు తెలియజేసినప్పటికినీ ప్రయోజనము కన్పించడములేదు. మన దేశంలో పండే వ్యాపార పంటలను ఎగుమతిచేసుకోడానికి సౌకర్యాలు కల్గించేందుకు డబ్బులేదు అని అంటున్నది ప్రభుత్వం. చెరకు, పసుపు, పుగాకు, వేరుసెనగ మొదలైన వ్యాపార పంటలు పండుతున్నాయి. అవి పండే భూములపై ప్రభుత్వంవారు ఎక్కువగా పన్నులు వసూలుచేస్తున్నారు. కోట్లకొలది రూపాయల విలువచేసే ఆహారపదార్థాలకు ఎగుమతి సౌకర్యాలు కలిగించడంలేదు. దక్షిణదేశానికి సంబంధించి మద్రాసు

లో మాత్రమే ఎగుమతి కొన్నిళ్లు ఉన్నాయి. అందువల్ల ఆంధ్ర ప్రదేశ్ ను లేకుండాచేయడం సరైనదికాదు. రైతులు పండించే వ్యాపార పంటలను ఎగుమతి చేసుకొనేందుకు సౌకర్యాలు కలిగించే నిమిత్తమై తగుచర్య తీసుకోవలసిన అవసరం ఉన్నది.

* శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు (వడమలపేట) :— అధ్యక్షా, నేను చిత్తూరు జిల్లానుంచి వచ్చినవాడను కాబట్టి అక్కడి, అడవులకు సంబంధించిన కొన్ని విషయాలు చెప్పదలచినాను. అటవిశాఖా మంత్రిగారు కూడా ఆ జిల్లానుంచి వచ్చిన వారే. అడవులలో lines కొట్టే సందర్భంలో రైతులకు చాలా నష్టాలు కలుగుతున్నాయి. ఈవిషయం ఒక్క చిత్తూరుజిల్లాలోనే జరుగుతున్న దనుకునే వాడను నేను యింతవరకూ. కాని ఈనాడు వచ్చిన cut-motions చూస్తే ఒక్క చిత్తూరు జిల్లాలోనేకాదు. ఇతర జిల్లాలలోకూడా యిటువంటి కష్టాలున్నాయని ధృవపడినది. అడవులలోనికి పోయి లైనులు కొట్టేటప్పుడు కొంతమంది నిరంకుశంగా ప్రవర్తిస్తున్నారు. కొంతమంది పెద్ద అధికారులుమాత్రం, మా బోటివారు చెప్పే సలహాలనువిని, గౌరవించి తగిన రీతిగా మార్పులు చేశారు. కాని కొంతమంది చిన్న అధికారులు రైతులు చెప్పినా, మా బోటివారు చెప్పినా కూడా వినకుండా నిరంకుశంగా, వారికి ఏవో కొన్ని సూత్రాలున్నాయని, వాటిని అనుసరించే చేస్తున్నామని చెబుతూ వారి ఇష్టం వచ్చినట్లు చేస్తున్నారు. అందువలన రైతులకు చాలా ఇబ్బంది కలుగుతున్నది. అటవిశాఖా మంత్రిగారు తాను రైతుకుటుంబంలో పుట్టినానని చెబుతున్నారు. అది వాస్తవమే. పైగావారు అడవి ప్రాంతంనుంచే వచ్చినారు. కాబట్టి అడవులకు సంబంధించిన విషయాలన్నీ వారికి బాగా తెలుసును. మేము యిదివరకు ప్రత్యేకంగా కొన్ని విషయాలను మంత్రిగారికి తెలియజేసినప్పుడు "చిత్తూరు జిల్లాలోని పడమటి ప్రాంతంలోనూ, తూర్పు ప్రాంతంలోనూ కూడా అక్కడ వుండే M.L.As. తో కలసి ఆలోచించి. లైనులు సరిగా లేని చోట్లల్లా సవరించి సరిగా చేయవలసింది" అని వారు ఉత్తరువులు వేశారు. ఆ ప్రకారం జరుగుతున్నది. అదేవిధంగా యీ లైనుల విషయమై రైతులు కష్టపడుతున్న అన్ని ప్రాంతాలలోను, అచ్చటచ్చట ప్రజాప్రతినిధులతో కలసి ఆలోచించి లైనులు సవరించడములో సహాయం చేస్తారని ఆశిస్తున్నాను. వారు ఇదివరకు రెండుచోట్ల ఆ ప్రకారం చేసి వున్నారు. అట్లా చేసినందుకు నేను వారిని అభినందిస్తున్నాను. ఈ విధంగానే ఆంధ్రప్రదేశ్ అంతకూ అమలు చేయాలని కోరుతున్నాను.

Grazing fees విషయమై ప్రభుత్వానికి అనేక ధఫాలు మనవి చేస్తున్నాను. Grazing fees ను తగ్గించడానికి ప్రయత్నం చేస్తున్నామని మంత్రిగారుకూడా సెలవిచ్చారు. ఈ బడ్జట్ లో అవి ఇమకు వచ్చినట్లు ఎక్కడా కనిపించుటలేదు.

పంచాయతీలకు కూడా కొంతభాగం యిచ్చే ఏర్పాటు చేసినట్లయితే, వారు సక్రమంగా చేస్తారు. ప్రభుత్వం వారు చేసినాసరే, లేక పంచాయతీలున్నచోట పంచాయతీల ద్వారా చేయించినాసరే, ప్రజలకు సౌకర్యం కలుగ జేయాలని కోరుతున్నాను. contract కు ఇచ్చినందువల్ల, దీనిని నమ్ముకొని జీవించే బీదప్రజలకు కష్టం కలుగు తున్నది. ప్రజలకూ తక్కువ ధరలకు దొరకడం లేదు. ఈ రెండు కష్టాలనూ తీర్చడానికి నేను చెప్పినట్లుగా చేసినట్లయితే, అనుకూలంగా ఉంటుందని మనవి చేస్తున్నాను.

Well subsidies ఇస్తున్నారు. కేంద్ర ప్రభుత్వంవారు సుమారు 400 బావు లకు subsidies ఇవ్వవచ్చునని తెలిసింది. మెట్టప్రాంతమైన చిత్తూరు జిల్లాకు 60 70 బావులకంటె ఎక్కువశాంక్షను కాలేదని కలెక్టరుగారివల్ల తెలుస్తోంది. మొత్తం చిత్తూరు జిల్లా అంతా మెట్టప్రదేశమే. మాగాణి, పల్లం భూములు ఎక్కడాలేవు. ఇది మంత్రిగారికి తెలిసిన విషయమే, చిత్తూరుజిల్లాలో యీతాలూకా ఆ తాలూకా అనే వివక్షత లేకుండా చిత్తూరు జిల్లాకు యిచ్చిన బావుల నన్నింటినీ కూడా అక్కడే పంచిపెట్టడానికి ప్రయత్నం చేయాలని మంత్రిగారిని ప్రార్థిస్తున్నాను. మెట్టజిల్లా అయిన చిత్తూరుజిల్లాకు విశేషంగా subsidies తెప్పించి, తద్వారా ప్రజలకు సౌక ర్యాలు కలుగజేయాలని కోరుతున్నాను ఇతరదేశాలలో బ్రహ్మాండమైన లోతుకు పోయి నీరు తెచ్చుకొని ప్రజలు సుఖపడుతున్నారని మంత్రిగారే చెప్పారు. ఈ deep wells విషయమై మన ఆంధ్రప్రదేశ్‌లో కూడా అక్కడక్కడ ప్రయ త్నాలు జరుగుతున్నాయి. వీటిద్వారా ప్రజలకు సౌకర్యాలు కలుగజేయడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. చెరువులు త్రవ్వించి వాటిలోకి నీరునింపి తద్వారా రైతులకు సౌకర్యాలు కలుగజేస్తున్నట్లుగానే యీ క్షామకాలంలో వీలైనచోట్ల ప్రభుత్వంవారి ఖర్చుతోనే, యీ deep wells ను త్రవ్వించి రైతులకు కావలసిన నీరు సప్లయి చేయవచ్చును. చెరువులు త్రవ్వించి నీటితీరువా తీసుకున్న విధంగానే deep wells ను త్రవ్వించి, నీరు సప్లయిచేస్తే, నీటితీరువా తీసుకోవచ్చు ఎవ్వరికీ ఆక్షేపణ ఉండదు. ప్రభుత్వం యీ పనిని అవశ్యం చేయవలెనని కోరుతున్నాను. deep wells కు అనువైనచోట్లు చిత్తూరు జిల్లాలో ఉన్నాయి. ప్రభుత్వంవారు యీ విషయమై తగు పరిశోధనలు జరిపించి deep wells ద్వారా రైతులకు నీటి సౌక ర్యాలు కలుగజేయాలని కోరుతున్నాను.

Agriculture, Electricity, Irrigationశాఖలు ఒక మంత్రిదగ్గరే ఉండడం మంచిదని నా అభిప్రాయం. ఇప్పుడు ఇరిగేషన్ ఒకరి వద్ద, అగ్రికల్చర్ మరొకరి వద్ద ఉండడంలో రెంటికి సమన్వయం లేకుండా పోతున్నది. ఇరిగేషన్ బాగా జరుగుటకు takenover estates లో పాతచెరువుల రిపేరీ జరుగవలసి ఉన్నది. ఎన్ని ప్రాజెక్టులు కట్టించినా చిత్తూరు జిల్లాకు ఏమాత్రమూ ప్రయోజనం లేదు. కాబట్టి

అక్కడ ఉన్న చెరువులనన్నింటిని సర్వే చేయించి చెడిపోయిన చెరువులను ముఖ్యంగా జమీందారీ ప్రాంతాలలోని చెరువులను ఒక ప్లానుప్రకారం అన్నీ చక్కగా మరమ్మతులు చేయిస్తే అవే మాకు ప్రాజెక్టులు. ఆ ప్రకారం ప్రభుత్వం చేసిన చిత్తూరు జిల్లాలోని రైతుల కష్టములు ఈడేరును

మాకు పెద్ద ప్రాజెక్టులు అవసరంలేదు. వర్షాకాలంలో పారే వాగులు చాలా ఉన్నవి. వాటికి కొన్నివేల రూపాయలు ఖర్చుచేసి చిన్నచిన్న ఆనకట్టలు కట్టించిన, ఆ అడవి ప్రాంతాలలో ఉన్న ప్రజానీకమునకు జీవనాధారం ఏర్పడుతుంది. మా నియోజకవర్గంలో రాయలచెరువు యిలాకాలో రాజకోనబావి అనే ప్రాంతంలో నీరు పారుచున్నది. అక్కడ ఒక కట్టకట్టించిన ఆ ప్రాంతంలోని రైతులు బాగు పడుదురని మంత్రిగారితో విన్నవించుకొన్నాను. అక్కడ రాయల చెరువు ఒకటి ఉన్నది. దానికి దిగువవైపున భూములున్న వారికి తప్ప పైపైపు వుండువారికి ఏమీ దానివల్ల లాభంలేదు. దానికి ఎగువవైపున కొన్ని వేల చదరపుమైళ్ళ భూమి ఉన్నది. అక్కడఉండే ప్రజానీకం అడవిమృగాలవలె బ్రతుకుచున్నారు. అటువంటి ప్రాంతమునకు ఒక్క చిన్న స్కీమును మంజూరు చేయవలసిందిగా మంత్రిగారికి మనవి చేసుకున్నాము. రు. 180 వేలు ఖర్చుచేసిన వంద ఎకరములు సాగవుతుందని estimate చేశారు. వంద ఎకరములమీద పెట్టుబడికి తగిన ఆదాయం రాదని,అందువల్ల చేయుటకు సాధ్యంకాదు అనే అభిప్రాయమునకు వచ్చినారు. ఆదాయం అంటే ఏమిటి? వ్యాపారం మీద ఆదాయం అనే దానిని చూడాలి. మన మంత్రిగారు సెల విచ్చినట్లు రైతులు సుఖపడడమే మనకు కావలసింది. ఏ నాగార్జునసాగరం మీదనో లేక మాచ్‌ఖండ్ లాంటి ప్రాజెక్టుల మీద పెట్టుబడికి తగ్గ ఆదాయం వస్తుందా? రాదా? అనే విషయం చూచుకోవాలే గాని చిన్నచిన్న ఆనకట్టలు, కొన్ని వేలు లేక కొన్ని లక్షల పెట్టుబడి కావలసిన వాటికి ఆదాయమును లెక్కకట్టడం న్యాయంకాదు. రైతుల శ్రేయస్సే ఆదాయం. వ్యవసాయ మంత్రిగారు ఇర్రిగేషన్ మంత్రిగారికి చెప్పి ఇలాంటి చిన్న స్కీములను మంజూరు చేయించుదురని నేను ప్రార్థిస్తున్నాను.

ప్రాజెక్టులు లేని జిల్లాలలోని రైతులు బాగుపడాలన్నచో ఎలెక్ట్రిసిటీ అవసరం. రెమ్యునరేషన్ 10% కాకుండా, దానిని తగ్గించి విరివిగా ఎలెక్ట్రిసిటీని సప్లై చేసినచో బావులనుండి నీరు సులభంగా తోడి పంటలు పండించు కొనుటకు వీలుగా ఉంటుంది. మంత్రిగారు చిత్తూరు జిల్లానుండి వచ్చినవారు. అక్కడి పరిస్థితులన్నీ వారికి తెలుసు. చిత్తూరు జిల్లాలో పోయిన సంవత్సరం తూర్పున అతివృష్టివల్ల, పడమర అనావృష్టి వల్ల పంటలన్నీ దెబ్బ తిన్నాయి. అక్కడ కరువు పరిస్థితులు ఏర్పడ్డాయి. కాని రెవిన్యూమంత్రిగారు అంగీకరించినట్లు కనపడడంలేదు. Famine అంటే ఏమిటి? దాని నిర్వచనం ఏమిటి? ఎప్పుడో చేసిన Finance Code ప్రకారం నిర్వచనం చేస్తే

ప్రయోజనం లేదు. చిత్తూరుజిల్లాలో పుత్తూరు మొదలుకొని పడమటి ప్రాంతాలలో కరవు వచ్చింది. ఇటువంటి పరిస్థితులలో వారికి పన్నుల మినహాయింపు, తక్కావి రుణాలు మొదలగు వాటి విషయం వ్యవసాయ మంత్రిగారు కొంచెం జాగ్రత్తగా గమనించాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీమతి పి. వాణీరమణారావు (భద్రాచలం—రిజర్వుడు).— అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండ్సును బలపరుస్తూ కొన్ని సూచనలు ప్రభుత్వ దృష్టికి తీసుకురాదలచాను. సాధారణంగా ఆదిమ జాతులవారు ఏజెన్సీలలో, అడవి ప్రాంతాలలో నివసిస్తూ ఉంటారు. ఏజెన్సీలలో లభించే సీకాయ, కుంకుళ్ళు, విస్తరాకులు అమ్ముకొని జీవనము చేస్తుంటారు. ప్రభుత్వంవారు, అమ్ముకునే వస్తువులకు సరియైన ధరలు లభించేటట్లు చేయాలి. కంట్రాక్టర్లు ఈ గిరిజన ప్రజలకు తక్కువ సొమ్మును చెల్లించి వారు అధికధరలకు అమ్ముకొని లాభాలను గడించుచున్నారు. అలాకాకుండా ప్రభుత్వమే తీసికొని గిరిజనులకు ఎక్కువ ధర వచ్చునట్లు చూస్తారని ఆశిస్తున్నాను. భద్రాచలం ఏజెన్సీలో బీడీఆకు అనగా తునికిఆకు విస్తారంగా లభించుచున్నది. కంట్రాక్టర్లు ఆ ఆకును తక్కువ ధరకు తీసికొని ఇతర రాష్ట్రాలకు ఎగుమతిచేసి లక్షల కొలది డబ్బును ఆర్జించుచున్నారు. అందువల్ల ప్రభుత్వమునకు, గిరిజనులకు చాలా తక్కువ ఆదాయమే గిట్టుచున్నది. కాన ప్రభుత్వం భద్రాచలంలో ఒక బీడీ ఫ్యాక్టరీని పెట్టినచో గిరిజనప్రజలను అభివృద్ధిలోకి తీసుకవచ్చుటకు అవకాశం ఉంటుంది. ప్రభుత్వమునకు గూడ ఎక్కువ లాభం వచ్చుటకు అవకాశం ఉన్నది. కోయ ప్రజలు అడవి నరకి పోడు వ్యవసాయం చేసుకొంటున్నారు. ఈ పోడు వ్యవసాయంవల్ల అడవి నష్టమగుచున్నదే కాని వారికిఎలాంటి లాభం చేకూరడంలేదు. కంట్రాక్టర్లు కోయ ప్రజలచేత అడవిని నరికించి ఆ కర్రను తీసికొనిపోయి లాభాలను పొందుచున్నారు. అలా కాకుండ ఆ కోయ ప్రజలు దానిని బొగ్గుక్రింద చేసికొన్నచో వారికి మంచి ఆదాయం లభిస్తుంది. వీటినన్నింటిని బట్టి ప్రభుత్వం పోడు వ్యవసాయం చేసుకొనువారికి త్వరలోనే పట్టాలను ఇచ్చిన అంతా ఒక చోటే చేరి వ్యవసాయం చేసుకొని బ్రతుకుటకు వీలు ఏర్పడును. తరువాత ప్రభుత్వం వ్యవసాయ పరికరములను కూడ సప్లై చేసినబాగుంటుందని నేను అభిప్రాయపడుచున్నాను.

పంట పండిన పిదప ఒక బస్తాకు రెండుబస్తాలు ఇచ్చేటట్లుగా కంట్రాక్టు వ్రాసి మంచి విత్తనములను షావుకార్లనుండి తెచ్చుకొంటారు. అందువల్ల పండిన పంట అంతా షావుకార్లకే ఇవ్వటానికి సరిపోతున్నది. అందుచేత ప్రభుత్వమే వారికి మంచి విత్తనములను సప్లయి చేయిస్తే వారు అభివృద్ధిలోకి రాగలరని మనవి చేస్తున్నాను. భద్రాచలం ఏజన్సీలో ట్రాక్టర్లుగాని, పంపుసెట్లుకాని, బుల్ డోజర్లుగాని లేవు. కోయ రైతులకు తక్కువధరకు అద్దెకు ఇచ్చేటట్లుగా వాటిని అక్కడ ఏర్పాటు

చేయాలని మంత్రిగారిని కోరుతున్నాను. భద్రాచలం ఏజన్సీలోని ఎల్లవరం, రంపచోడవరం, నూగూరు, భద్రాచలం అని 4 తాలూకాలున్నవి. 4తాలూకాలలో, 3 తాలూకాలలో పశువుల మేతకు పుల్లరిలేదు. నూగూరు తాలూకాలో, పుల్లరి తీసుకొంటున్నారు. ఆ విషయమును నిరుటి బడ్జెటు సమావేశములోనే ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చాను. అనేకసార్లు మంత్రిగారికి జ్ఞాపకం చేశాను. మరల ఆ విషయమునే ఈ బడ్జెటు సమయంలోకూడ చెప్పటం విచారకరముగా ఉంది. ఇకనైనా వెంటనే చర్యతీసుకొని పుల్లరిలేకుండా మంత్రిగారు చేస్తారని ఆశిస్తున్నాను. గిరిజనుల అభివృద్ధి కోసం కృషి చేస్తున్నామని చెప్పే ప్రభుత్వం ఇంతవరకు ఆ పుల్లరిని తీసివేయలేక పోయినది అంటే వారి అభివృద్ధి కొరకు ఏవిధమైన కృషిచేస్తున్నదో అందరికి అర్థమవుతున్నది. గిరిజనులకు చేపలపైన అమితమైన ఇష్టంవుంది. ఇప్పుడు వారి వలలపై పన్ను వసూలు చేస్తున్నారు. ఆ పన్నులేకుండా చేయాలని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఇండ్లు కట్టుకోటానికి ఇతర కులస్థులకు ఏజన్సీలోని కలప దొరుకుతుంది. కొండ ప్రజలచేత దొంగతనంగా అడవిలో కలపను కొట్టించి ఇండ్లకు జేరవేయించుకొంటారు. ఎవరైన పట్టుకుంటే కలపకొట్టే ఈ కోయవారిపైనే కేసులు పెడుతున్నారు. అటువంటివి జరుగకుండా, ఆ కులాలవారికికూడా కలప లభింపచేయటానికి ప్రభుత్వము ప్రయత్నించాలని కోరుతూ సెలవు తీసికొంటున్నాను.

శ్రీ టి. రామచంద్రారెడ్డి (పుట్లూరు):- అధ్యక్షా! శ్రీ తిమ్మారెడ్డిగారు ప్రవేశపెట్టిన వ్యవసాయ పద్దును నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. రైతుబిడ్డయే వ్యవసాయ మంత్రిగా వుండటం గొప్పవిషయం. అందుచేతనే వారు ఏది మాట్లాడినా, రైతులపరముగా, మనసులో వున్నదంతా బైటకు చెప్పివేస్తారు. గత నాలుగు రోజులనుండి బడ్జెటు విషయాలపై కొంత చర్చ జరిపాము. ఈ సంవత్సరము సర్‌ప్లస్‌బడ్జెటు ఏర్పడటానికి రైతులపై వేసిన ఈ పన్నులే కారణమని ఎవ్వరూ మర్చిపోకూడదు. ప్రతిచిన్న విషయానికి రైతుపైననే పన్నువేయుటం జరుగుతున్నది. బెటర్‌మెంటుటాక్సు, సర్చార్జి, కమర్షియల్ క్రాప్స్ అంటూ అనేకరూపాల్లో ఈ రైతులపైనే వేస్తున్నాము. కాని ఆ రైతులకు కావలసిన సదుపాయములను మనము కలుగచేస్తున్నామా? అనే విషయమును గురించి మాత్రము ఆలోచించటములేదు. గత నాలుగు రోజుల బడ్జెటు ప్రసంగాలలో ఆహార పదార్థాల ధరలు విపరీతంగా పెరిగాయని గౌరవసభ్యులు చెప్పారు. ఆవిధంగా మాట్లాడిన సభ్యులను నేను ఒక్కటే కోరుచున్నాను. దయతో గ్రామసీమలకు వెళ్ళి అక్కడ రైతులు చేస్తున్న ఖర్చుకు గిట్టేధరలు వున్నాయా" అనేవిషయం విచారించి ఉపన్యాసాలు చేస్తే బాగుంటుందని వారిని కోరుతున్నాను. రైతులు ఎంత ఖర్చు పెడుతున్నారో తెలుసుకోకుండా ప్రసంగాలు చేయటం నిరుపయోగమని మనవి చేస్తున్నాను. వ్యవసాయానికి అవసరమైన ప్రతిచిన్న సందర్భంలోకూడా ఖర్చు విపరీతముగ పెరుగుతున్నది. ఒక

కాడి ఎద్దులు 2 వేలకు తక్కువకురావటంలేదు. బండిపట్టాలు కొనాలంటే బ్లాక్ మార్కెట్టులోకూడా రూ. 120 లకు దొరకటంలేదు. వ్యవసాయ పనిముట్ల గురించి తిమ్మారెడ్డి గారికి అనేకసార్లు చెప్పాను. వారికి పనిముట్లు లభ్యం కావటములేదు. రైతుల కోర్కెలను నెరవేర్చలేనప్పుడు వారిపై ఎందుకు ఈ పన్నులు వేయటం? అనినేను అడుగుతున్నాను. ఇప్పటికైనా మనప్రభుత్వము శ్రద్ధవహించి కేంద్ర ప్రభుత్వమునుంచి మనకు రావలసిన కోటాను ఏరీతిగానైన తెప్పించి రైతులకు కావలసిన పనిముట్లను అందచేస్తారని ఆశిస్తున్నాను. ఇటీవల రెండు సంవత్సరాల నుండి మా ప్రాంతములోనూ, చుట్టుప్రక్కల గ్రామాలలోను వరిపంటకు తెగుళ్ళు వస్తున్నవి. వ్యవసాయశాఖవారి వద్దనున్న మందులను వేసినా ఆ మందులఖర్చు కూడా రైతులకు గిట్టుబాటు కావటంలేదు. ఇటువంటి పరిస్థితులలో రైతులుపండించే పంటకు విపరీతమైన ధరలు వుంటున్నాయని అనటం శోచనీయముగా ఉంది. కూలీలకే రోజు 2,3 రు॥ ఇవ్వవలసి వుంటుంది. అటువంటి విషయాలన్నీ అర్థం చేసుకొని గౌరవ సభ్యులు ప్రసంగిస్తే బాగుంటుందని మీద్వారా వారికి తెలియజేస్తున్నాను.

జిల్లాలలో ఏ భూమికి ఏరకమైన విత్తనం కావాలి అన్న విషయం మాత్రం మన వ్యవసాయ శాఖ దృష్టికి యింతవరకు రాలేదు. ఏదో వాళ్ళకు లభ్యమైన విత్తనాలను మాత్రం సప్లయి చేస్తున్నారు. కాని మంచి విత్తనాలను సప్లయి చేయడం లేదు. ఫలానా భూమికి, ఫలానా విత్తనం వేస్తే బాగుంటుందన్న పరిశోధన చేయుట లేదు. ఈ విషయంలో కూడా వ్యవసాయ మంత్రి తగుశ్రద్ధ తీసుకొంటారని ఆశిస్తున్నాను. ఇక గ్రామాలలో చాలమంది ఆయిల్ ఇంజన్స్‌తో వ్యవసాయం చేస్తున్నారు. కాని ఆయిల్ ఇంజన్స్ మార్కెట్టులో సరిఅయిన ధరలకు లభ్యం కావడంలేదు. బ్లాకుమార్కెటులో కొంటూ వ్యవసాయ పనులు చేసుకొంటున్నారు. ముఖ్యంగా మనదేశం వ్యవసాయంమీద ఆధారపడి యున్నది. కాబట్టి వ్యవసాయదారులకు ఎక్కువ సదుపాయాలు కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వంపై ఉన్నది. అందువల్ల వ్యవసాయపనిముట్లు సరసమైన ధరలకు లభించేటట్లు చూడవలసినదని కోరుతున్నాను. నూతన పద్ధతులలో వ్యవసాయం చేయడానికి ప్రయత్నిస్తున్నాం. అందుకు తగువిధమైన ఏర్పాట్లు చేయడం అవసరము. వ్యవసాయదారులకు ట్రాక్టర్లను యిస్తున్నారు. కాని వాటికి కావలసిన spare parts లభ్యం కావడంలేదు. ఈ విషయంలోకూడ, మంత్రిగారు శ్రద్ధగా విచారించాలని కోరుతున్నాను. అధ్యక్షా ఇక ఒక్కవిషయం మనవి చేస్తాను. తెలంగాణా ప్రాంతంలో తక్కావీ రుణాలను రద్దుచేశారు. ఆంధ్రప్రాంతంలో కూడ రైతాంగ పరిస్థితిని గ్రహించి ఆ తక్కావి రుణాలను రద్దుచేయాలని మనవి చేస్తున్నాను. అనంతపురం జిల్లాలో పరిస్థితి ఆందోళనకరంగా ఉన్నదని మంత్రులు ఒప్పుకొన్నారు. ఏ ప్రాంతంలో అయితే పరిస్థితులు తృప్తికరంగా ఉండవో, అటువంటి ప్రాంతాలలో కూడ ఈ తక్కావీ

ఋణాలను రద్దుచేయవలెనని మీ ద్వారా కోరుతూ, యీ అవకాశం మీరు యిచ్చి నందుకు ధన్యవాదములు.

శ్రీ కె. రాజమల్లు:- అధ్యక్షా ! మంత్రిగారు రైతుల గురించి మంచి సాను భూతి వాక్యాలు పలికారు. రైతులకు యిబ్బందులు, కష్టాలు ఉన్నాయని చెప్పారు. ఈనాడు మన సొసైటీలో కృంగిపోయిన మనిషి ఒక్క రైతే కనపడుతున్నాడు. అనేక రకాలైన పన్నులను వేసి రైతును ఖూనీ చేస్తున్నది ప్రభుత్వం ! కాని "రైతు లకు మేలు చేయాలని ప్రభుత్వానికి సంకల్పం ఉంది, ధన లోపంవల్ల చేయలేక పోతున్నాం" అంటున్నారు మంత్రిగారు. ఇది ఎలాగ యున్నదంటే, నియంత ప్రజా స్వామికం గురించి బోధించినట్లున్నది. ఇక ఈ పోదుపు ఉద్యమంద్వారా ఆఫీ సర్లు రైతులను పెట్టే బాధలు వేరే చెప్పనక్కరలేదు. ప్రభుత్వం ఎంతసేపూ రైతులమీద పన్నులు వేయుటకే చూస్తున్నది గాని, వారి పంట అభివృద్ధికి, వారి పశువుల అభివృద్ధికి తగిన పనులు చేయుటలేదు.

ఇక ఫారెస్టు డిపార్టుమెంటును చూచినట్లయితే యెక్కడా లేని లంచగొండి తనం ఈ డిపార్టుమెంటులోనే ఉన్నది. అడవిలో కట్టెలు కొట్టుకొని దొంగతనంగా డిపార్టుమెంటువారు, యింకా యితరులు అమ్ముకొంటూ ఉన్న సందర్భాలను, అధి కారుల దృష్టికి తీసుకొని వస్తే, దానిపై ఏ విధమైన చర్య తీసుకొనలేదని మనవి చేస్తున్నాను. తరువాత ఈ అడవులను వేలం వేసేటప్పుడుకూడా చాలా అన్యాయాలు జరుగుతున్నవి. రు.4 లక్షల ఖరీదు చేసే అడవిని రు 80 వేలకు వేలం లేకుండా యిచ్చిన సందర్భాలు మంచిరియాలలో నేను చూపించగలను. అట్లా తీసుకొన్న వాడు ఒక పెద్ద కాంగ్రెస్ మనిషి. ఆయనకు యివ్వడానికి కారణం ఆలోచిస్తే మంత్రిగారికి ఎలక్ష న్సులో సహాయం చేశారు కాబట్టి, యిచ్చినట్లుగా తెలుస్తున్నది. కాంట్రాక్టర్లు, ఉద్యో గులు కలసి చెట్లను దొంగతనంగా నరికి అమ్ముకొంటూన్న సందర్భాలు ఎన్నో ఉన్నాయి. ఆ చెట్లను నరుకుటలో పైకి కనపడకుండా మొదలుఅంటా నరకడంచేత, మైదానాలు మాత్రమే యిప్పుడు కనబడుతున్నాయి. ఇప్పుడు దాని క్రింద ఖర్చు పెడుతున్న పద్దు ప్రతి సంవత్సరంకంటే అదనంగా ఉందని చెపుతున్నాను. కాని మంత్రిగారికి ఉన్న సంతృప్తి ఏమిటంటే—ఆయన కోరిన డిమాండ్సును సభ ఆమోదించింది, ఆ మొత్తములుకూడ ఖర్చు అవుతున్నాయని ఖర్చు పెట్టడంతో సంతృప్తి చెందక, ఖర్చు అయిన మొత్తానికి తగిన ఫలితం వస్తున్నదా, లేదా? అన్న సంగతికూడ చూడవలసిన బాధ్యత మంత్రిగారిపై ఉన్నది. మంత్రిగారైనా ఒక్క surprise check చేసి, ఏప్రాంతంనుంచి application వచ్చిందో ఆ ప్రాంతానికి వెళ్ళి అక్కడ నిజంగా అడవి వుండెనా? లేదా? వుంటే అది ఇప్పుడు ఏమైంది? దానికి బాధ్యులెవరని investigate చేసి ఒక్కరిమీదనైనా

లంచగొండితనం కేసు పెడితే ఇకముందు అలాంటి పనులు తగ్గడానికి అవకాశ ముంటుంది. కాని ఇటువంటిది ఏదీ జరగలేదు.

Agricultural Assistant చిన్నచిన్న రైతులకు ఏఏ కాలాల్లో ఏఏ పంటలు వేయాలి, రోగాలువస్తే ఏమందు వాడుకోవాలి అనే విషయాలు తెలియచేయాలి. ఆంధ్ర లోని రైతులకంటె తెలంగాణా రైతులు చాలా వెనుకబడి వున్నారు. ఈ Agricultural Assistants పెద్ద భూస్వాములకే సలహాలిస్తున్నారు కాని బీద రైతులకు ఇవ్వడంలేదు. పన్నులుకూడా పేద రైతులపైనే ఎక్కువ విధిస్తున్నారు. ఈ మధ్య వ్యవసాయ శాఖలో ఫీల్డుమెన్, ఫారం మేనేజర్లు, ఎడిషనల్ డిమాన్‌స్ట్రేటర్సు ఉద్యోగాలకు interview జరిగింది. దానిలో చాలాఅపకతవకలు జరిగాయి. అనుభవం, సీనియారిటీవున్న వారిని select చేయడం మానివేసి తమకు యిష్టంవచ్చిన probationers ను S. S. L. C. pass కాని వారిని తీసుకొన్నారు. Interview కు 106 మందిని పిలచి 46 మందిని select చేసికొన్నారు. ఈ విధంగా favouritism తో ఈనాడు పరిపాలన సాగుతోంది.

శ్రీ జి. రామస్వామిరెడ్డి (పెదకూరపాడు):— అధ్యక్షా: ఈనాడు వ్యవసాయశాఖ మంత్రిగారు ప్రవేశపెట్టిన Demand చాలా స్వల్పంగా వుంది. Police Demand కన్నా తక్కువే. మన వ్యవసాయ మంత్రిగారు ఆహార కొరత వున్న ఈ రోజుల్లో ఇంతతక్కువ మొత్తాన్ని కోరడం సమంజసమేనా అని నాభావం. Forests కు సంబంధించి 1—2 విషయాలు చెబుతాను. అడవులలో పశువులు మేయ డానికి పశువు ఒక్కంటికి ఎనిమిదణాలు పుల్లరి వసూలు చేస్తోంది ప్రభుత్వం. పులిచింత—చింతపల్లి అనే ఒక కేంద్రముంది. అక్కడకు 10 వేల పశువులు ఎంతో దూరంనుంచి, జిల్లా నలుమూలలనుంచి పశుగ్రాసానికి వస్తాయి. ఎండ వానల నుంచి తట్టుకొనడానికైనా ఆ పశువులకు ఒక్క shelter shed కూడా లేదు. కాబట్టి అది కట్టించమని కోరుతున్నాను.

పశువుల ఆస్పత్రులు మన రాష్ట్రంలో చాలినన్ని లేవు. కాబట్టి ప్రభుత్వం శ్రద్ధతీసుకొని పశువుల డాక్టర్లు సర్వకాల సర్వావస్థలయందు రైతులకు అందుబాటులో వుండే ఏర్పాట్లు చేయమని మనవి చేస్తున్నాను.

మనకు ఈనాడు దేశంలో ఆహారం కొరతగా వుంది. ఈ సమస్యా పరిష్కారానికి మన మంత్రిగారు చెప్పినట్లు మత్స్య పరిశ్రమను అభివృద్ధి చేసుకోవాలి. కేరళ ప్రభుత్వం జపాన్ దేశం కప్పలను ఎగుమతిచేసి డాలర్లు సంపాదిస్తున్నట్లు విన్నాను. అదేవిధంగా మన దేశం విదేశీ ద్రవ్య కొరతనుంచి తట్టుకొనేందుకు ఈ కప్పలను విదేశాలకు ఎగుమతి చేయడానికి ఎంతవరకు అవకాశాలున్నాయో పరిశీలించమని కోరుతున్నాను.

దేశం ఎదుర్కొంటున్న ఆహార సమస్యను పరిష్కరించే ఉద్దేశ్యంతో కేంద్ర ప్రభుత్వం ఈనాడు అధికాహారోత్పత్తి చేసిన రైతులకు ప్రోత్సాహం ఇచ్చే ఉద్దేశ్యంతో వారికి గోపాలరత్న అని బిరుదులిస్తున్నారు. వ్యవసాయ పద్దు క్రిందకోరిన demand చాలా తక్కువగా వుంది. Social welfare, Scheduled Tribes and castes పద్దుకు కేటాయించిన మొత్తానికి వ్యవసాయపు డిమాండ్ సమంగావుంది. ఆహారసమస్య దేశంలో పెద్ద సమస్యగా ఉంటే దాని పరిష్కారానికి పూనుకొనకుండా యింతస్వల్ప మొత్తం కేటాయించడం ఏమీ భావ్యంగా లేదు. రైతుకు సరైన గిట్టుబాటు ధరలు తను పండించే ధాన్యానికి ఉండాలి. Marketing facilities ఉండాలి. రైతుకు గిట్టుబాటు ధర విషయమై శ్రీ తిమ్మారెడ్డి కేంద్రంతో తీవ్రంగా పోరాడుతున్నారు. వీరిచర్యలకు యావత్ రైతాంగం, ముఖ్యంగా ఆంధ్రరైతాంగం హర్షిస్తోంది. ఈ నాడు శ్రీ తిమ్మారెడ్డి మంత్రివర్గంలో వున్నారు గనుకే రైతులపై ఎన్నిపన్నులు పడుతున్నా భరిస్తూ ప్రభుత్వంపై విశ్వాసంగా ఉన్నారు.

ఈ సందర్భంలో వారి ప్రతి చర్యనూ రైతాంగము సమర్ధిస్తూ వారివెంటఉండి వారినే అనుసరిస్తున్నది. ఈ వ్యవసాయానికి సంబంధించిన వ్యవహారాలలో వారు అనేకవిధాల కృషిచేశారు. రైతులకు పొగాకు విషయంలో సరియైన ధర రాబట్టడానికి ఇటీవల I.L.T.D Company వారితో, అనేక విధాల సంప్రదించి, వారికి సహాయము చేకూర్చారు. కావున ఈ సంవత్సరం పొగాకుకు మంచి ధరలే ఇస్తున్నారు. అంతేకాకుండా, అంతర్జాతీయ ధరలు ఇప్పించడానికి తగిన చర్యలు తీసుకుంటు న్నారు అని తెలుస్తున్నది. ఈ నాడు ప్రతిఒక్కరూ ధరల పెరుగుదలను విమర్శించే వారేకాని, రైతుల పరిస్థితులు ఏ విధంగా ఉన్నవో ఆలోచించేవారు ఎవ్వరూ లేరు. వారు పండించే ధాన్యానికి. గిట్టుబాటు ధరలు కావాలని కోరడం ఏమంత అన్యాయమైన విషయం కాదు. గిట్టుబాటు లేకపోతే వారిస్థాయిలో ఇతర ఖర్చులను భరించాలంటే చాలా కష్టము. కావలసివస్తే fair price shops ను పెట్టి బీదలకు కష్టం లేకుండా వుండే పరిస్థితులను మనము ఆలోచించుకోవచ్చు.

ఇక వాణిజ్య పంటల ధరలు, ఏ సంవత్సరానికి ఆ సంవత్సరము, స్థిరీకరణ లేకుండా తగ్గుతూ, హెచ్చుతూ ఉండడము వల్ల, రైతులకు సరియైన కాలంలో, సరియైన ధరను రాబట్టు కోవడానికి వీలులేకుండా ఉన్నది. ఈ విషయంలో State Trading Corporation, Export Promotion Council, ఈ లాంటివి ఇటీవలనే పెట్టారు. ఇవి నామమాత్రంగానే ఉన్నాయి; కాని, రైతులకు గిట్టుబాటు ధరలు ఇప్పించి, ఇతర దేశాలకు సరుకును రవాణా చేయించి, భారతదేశానికి "డాలర్లు" సంపాదించిపెట్టే విషయంలో ఎక్కువ శ్రద్ధవహించడం లేదు.

ముఖ్యంగా ఇది వ్యాపారస్తుల పలుకుబడికి, లోనై సరిగ్గా వ్యవహరించడం లేదని నా ఉద్దేశ్యము. ఈ విషయంలో ప్రభుత్వము తగు శ్రద్ధ తీసుకోవాలని మనవి చేస్తున్నాను.

అంతేకాకుండా రైతుకు ఈ నాడు పరపతి అనేది పూర్తిగా చనిపోయింది. ప్రభుత్వము ఇచ్చే 100/-, లేక 200/- రూపాయలు అప్పు రైతులకు ఏ పరిస్థితుల లోనూ సహకరించడంలేదు. కాబట్టి, long term loans ఇంకా ఎక్కువ చెయ్యా లని కోరుతున్నాను.

శ్రీ ఎ. బాపినీడు (కొవ్వూరు–జనరల్):– అధ్యక్షా ! ఈ Budget లో ముఖ్యంగా, వ్యవసాయ ఉత్పత్తికి గాని, దానికి సంబంధించిన Forests, Fisheries వగైరాలకు గాని, సరియైన మొత్తాన్ని కేటాయించలేదని చెప్పడానికి ఏ మాత్రము సందేహము లేదు. అయితే ఇది Surplus Budget అనే విషయానికి, మాత్రము సంతోషిస్తున్నాను.

ఇతర దేశాలనుంచి 100 కోట్ల రూపాయల ఆహారధాన్యాలను మనము దిగుమతి చేసుకునే రోజులలో, అధిక ఆహారోత్పత్తికిగాని, తదితర వ్యవసాయానికి సంబంధించే విషయాలలోగాని ప్రభుత్వం తగినంత శ్రద్ధ వహించడం లేదనే చెప్పవలసి వస్తున్నది.

సాధారణంగా పట్టణాలలో, మేడలలో, మిద్దెలలో నివసించే ప్రజానీకము, వ్యవసాయము గురించి ఏమీ తెలియనప్పటికీ పదేపదే, ఈ ధాన్యాల ధరలు, మిగతా వస్తువుల ధరలు ఎక్కువై పోతున్నవని ఆందోళన చెయ్యడం వ్యవసాయ విషయమై మాట్లాడడము జరుగుతున్నది. ఇక్కడే కాదు. కేంద్రములోకూడ ఇదే ధోరణిలో మాట్లాడడము జరుగుతున్నది. వ్యవసాయంమీద ఆధారపడే పల్లెటూరి ప్రజలు నూటికి 80 మంది దేశంలో ఉండగా, ఏ 10%, 20% పట్టణాలలో ఉండి ధరల పెరుగు దల గురించి ఆందోళన చెయ్యడం శోచనీయమైన విషయము.

ఒక్క ధాన్యానికేగాక, మిగతా పొగాకుకుగాని, పసుపుకుగాని, కొన్నివేల పుట్లు పండించే మిరపకాయకుకూడా ధర సరిగ్గాలేదు అని మనవి చేస్తున్నాను. అంతే గాక, మన కర్మవశాత్తు, మనము పండించే మిరపకాయ, "సిలోను" కు వెళ్లడానికి వీలు లేదు. Permit తీసుకు వెళ్లి మద్రాసులో అమ్ముతున్నారు. ప్రస్తుతం పసుపు ధర రు. 50/– లు కూడ లేదు. మన రాష్ట్రములో పండే పొగాకును, కేంద్ర ప్రభు త్వము తీసుకుపోయి, లాభసాటి ధరకు, ఇతర దేశాలకు పంపి కొన్ని కోట్ల రూపాయలను సంపాదించుకోగలుగుతున్నది. కాని ఒక్క రూపాయైనా మన రాష్ట్రంలో ఖర్చు పెట్టడము లేదంటే, అందుకు కారణము మనకు అక్కడ పలుకు

నుంచి ఆందోళన చేసినవారిలో నేనుకూడ ఒకడిని. అయితే గత సంవత్సరంనుంచీ society ల ద్వారానే అమ్మకము జరుగుతున్నా ముఖ్యంగా ఈ సంవత్సరం private వర్తకులకంటే ఎక్కువగ black-market చెయ్యడానికి వారు సాహసించలేదని మనవి చేస్తున్నాను. ఎంత అయినప్పటికి, ఈ private వర్తకులు, వాళ్లను మధ్య పెట్టి, మాయచేసి ఏ 10/– రూ. లేక 5/– రూపాయలో ఎక్కువ వేసి, అమ్మించే లాగు చేయిస్తున్నారు. కొన్ని సందర్భాలలో రసీదులతో సహా పట్టు బడ్డారు. కాబట్టి ఈ ammonia సరియైన ధరకు, నేరుగా రైతుకు అందే మార్గము చూడవలసిందిగా మంత్రిగారిని మీ ద్వారా కోరుతున్నాను.

ఇక, ఈ fisheries and forests విషయంలో చాల శ్రద్ధ వహిస్తున్నారు. ఈ Fisheries ఇంకా ఎక్కువగా అభివృద్ధి చెయ్యవలసిన అవసరం ఉన్నది.

Forests విషయంలో అవినీతి, అక్రమము ఎక్కువగా జరుగుతున్నది. ముఖ్యంగా రైతులు, వాళ్ల స్వంత చేలలోనుంచి పుల్లలు వగైరా తెచ్చుకుంటుంటే, permit లు కావాలని, Forest Deparment వారు అనేక బాధలు పెడుతున్నారు. కావున అటువంటి rules ఏవైనా ఉంటే, కొంచెం సడలించాలని కోరుతున్నాను.

మార్కెటింగు కమిటీలను వృద్ధి చేసి అన్ని జిల్లాలలో ఏర్పాటుచేస్తే ఉత్పత్తి క్రమముగా ఎక్కువ అయి సరైన ధరలు రప్పించడానికి మన మంత్రి శ్రీతిమ్మారెడ్డి గారు చేస్తున్న కృషికి నేను వారిని చాలా అభినందిస్తున్నాను. భూసంస్కరణలు తీసుకవస్తే ధరలు సరిపోతవి అని శికిందరాబాదు శాసన సభ్యులు అన్నారు. ఇది సరైనది కాదు. ఈనాడు ఆహారోత్పత్తి అధికము కావలెనంటే వ్యవసాయదార్ల పంటలకు సరి అయిన ధరలు కావలెను. అంతేగాని భూసంస్కరణలనే నినాదము వల్ల ప్రయోజనము లేదు. మనదేశములో 100కి 80 మంది వ్యవసాయదార్లు ఉన్నారు. పట్టణములలో ఉండి జీతాలు పెంచుకుంటున్న వారికి కావాలని ఉత్పత్తి ఎక్కువ కాదు. కష్టపడేది రైతులు, అనుభవిస్తున్నవారు పట్టణాలలో ఉండేవారు. కాబట్టి రైతులకు సరైన ధరలు వచ్చేటట్లు చూడాలని మనవి చేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

*శ్రీ పెద్దంటి రామస్వామినాయుడు (బలిజపేట):— అధ్యక్షా మహాశయా,— నేను మన వ్యవసాయశాఖా మంత్రిగారు ప్రవేశ పెట్టిన వ్యవసాయము మొదలైన పద్దులను సమర్థిస్తూ వ్యవసాయాన్ని గురించి ఒకటి రెండు విషయాలు చెప్పదలచుకున్నాను. వ్యవసాయ మనేదానిని ప్రాచీనకాలంనుండి 'కృషి' అని చెబుతూ వచ్చారు. ఇది అపారమైన విషయము. భారతదేశములో దీనికి ఉన్న ప్రాధాన్యత ఇంతింత అని చెప్పడానికివీలు లేదు. మానవ చరిత్ర ప్రారంభమైనప్పటి

నుంచి సుమారు 5000 సంవత్సరాలనుండి వ్యవసాయము అత్యంత ప్రాముఖ్యత, గౌరవము కల్గినదని మన శాస్త్రములు ఋజువు చేయుచున్నవి. ఈ విషయమై "కృషి ప్రశంస"లో ఈ విధముగా చెప్పబడింది.

శ్లో॥ రాజ్యగాత్రే మహాసారే । కేవలం కృషికశ్శిరం
అత్రజాగర్తి భూపాలః । ప్రజ్ఞాచక్షుః ర్దినేదినే॥

అంటే ఈ రాజ్యం అనే శరీరంలో కృషికుడు అనేవాడు (వ్యవసాయదారుడు) శిరస్సుతో సమానము. భూపాలుడు అంటే సామ్రాజ్యాన్ని పరిపాలించేవాడు. అంటే ఇక్కడ మన ప్రభుత్వం రైతు అభివృద్ధిని జాగ్రత్తగా రోజూ చూడవలెనని శాస్త్రాలు ఘోషిస్తున్నవి. నేడు వానిని గురించి గౌరవనీయులైన వ్యవసాయశాఖ మంత్రిగారు ప్రవేశ పెట్టిన పద్దులు మొత్తం ఆశాజనకముగా ఉన్నవి. అయితే ఈ మొత్తములు చాలవు అని మనవి చేస్తున్నాను. కాలము మారిపోయి నూతన పరిణామాలు కలుగుతూ ఉన్న ఈ రోజులలో నూతనపద్ధతులతో ఇతర దేశాల వారు అధిక పంటలు పండించుచున్నారు. అట్టి పద్ధతులను మన దేశములో ఆంధ్ర ప్రజలకు అందచేస్తే తగిన ప్రయోజనము ఉంటుంది. అట్టివాటికి ఈ ధనము చాలదు. అవకాశాన్ని బట్టి వారు అలా చేసి ఉంటారు. కాని ఈ మొత్తాన్ని ఏవిధముగా నైనా హెచ్చు చెయ్యవలసిన బాధ్యత మంత్రివర్గము మీద ఉన్నది అని మనవి చేస్తున్నాను. నేడు వ్యవసాయశాఖ వారు చేస్తున్నట్టి పరిశోధనను పరిశీలించినట్లైతే ఇదివరకు కంటె చాలవరకు శాస్త్రజ్ఞానము ఎక్కువ చెయ్యడానికి దోహదము కలుగ చేస్తున్నారు అని తెలుస్తుంది. అయితే ఈ శాస్త్రీయ విజ్ఞానము రైతుకు అవసరమైనంతగా అందడము లేదు. ఇందులకు ఎక్కువగా ధనం వ్యయము చెయ్యవలసి ఉన్నది. ప్రతి తాలూకాకు ఒకరో ఇద్దరో డిమాన్‌స్ట్రేటరులు ఉంటున్నారు. వారు నెలకు 20 రోజులు తాలూకాలో తిరిగినా పల్లె ప్రజలకు రైతులకు ఈ విజ్ఞానము అందచెయ్యలేకున్నారు. నవీన పద్ధతులను ప్రచారంలోనికి తీసుకు రాలేకపోతున్నారు కనుక ఈ సిబ్బందిని ఇంకా ఎక్కువ చెయ్యవలెను.

ఈ వ్యవసాయ వృత్తిని గురించి శ్రీకృష్ణ విజయములో పద్యంఉంది.— "ఒకచెయ్యి మేడిమీద, మరియొకకరంబును దానమందు పాయిక ఇడి,ధాన్యరాసులఅనయంబున కూర్చుచు ఇచ్చుచుండు కర్షకునకు సాటి ఎవ్వరు ధరాతలంముందు, ఘనుడీ తండె, ఓపికయు, ప్రజానురాగమును పెంపువహించిన ఏరిఎల్లరన్.

ఈ రైతులనుప్రతివారును సానుభూతితో చూడవలసిన అవసరంఉన్నది. తాను కష్టపడి పండించిదానిలో కొంతభాగము దానం చేస్తున్నాడు. పెద్దపెద్దకుప్పలు నూర్చేటప్పుడు రాశిగాపేసినప్పుడు తట్టలతోను,బుట్టలతోను దానం చేస్తాడు.అట్టి రైతుక్షేమానికి ప్రభుత్వం ఎంతైనా మేలు చెయ్యవలసి ఉన్నది. నూతన పద్ధతులను వారికి అందచేసి

ఇతోధికముగా వారి పంటల అభివృద్ధి చేయుట ప్రభుత్వంయొక్క ధర్మమని హెచ్చరిస్తున్నాను. గౌరవనీయులైన మనరామకృష్ణరాజుగారు చెప్పినట్లు వ్యవసాయ, నీటి పారుదల శాఖలు కలసి పని చేసినపుడే రైతులు అభివృద్ధి చెందడానికి అవకాశము ఉంటుంది. ఇందుకై మైనరు ఇరిగేషను శాఖ అయినా వ్యవసాయ శాఖా మంత్రిగారి అధీనములో ఉంటే జమీందారీ ప్రాంతాల చెరువులను మరమ్మత్తు చెయ్యడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. శ్రీమపటి అన్నివిధములా పాడైపోయిన రైతులు ఏమీ అనుభవించ లేకుండా ఉన్నారు. సమయమునకు వర్షాలు లేకుండుటవలన వారు విశేష నష్టములకు గురి అగుచున్నారు. ఉన్న చెరువులు సర్వవిధముల పాడైపోవుటవల్ల వాటిలో నీరు ఉండుటలేదు. అందుచేత పంటలు పండించ లేకున్నారు రైతులు.

కనుక యీ చిన్న నీటి వనరుల సౌకర్యములు కలుగ జేయడం చాలా అవసరము అని నేను భావిస్తున్నాను. ఇపుడు ప్రణాళికలో పెద్ద పెద్ద ప్రాజెక్టులకు గాను కోట్లు ఖర్చు పెట్టడము జరిగింది. నాగార్జున సాగర్ మొదలైన వాటిని కట్టుచున్నారు. అవి మంచివే. కాని అవి వెంటనే ఫలితాన్ని కలుగజేయవు, 10-15 సంవత్సరాల కాలము పడుతుంది. అంతవరకు మన ఆంధ్ర దేశములో అనేక వేల గ్రామాలలో పంటలు పండించకుండా వుండిపోవడము అన్యాయము. కనుక వెంటనే ఫలితాన్ని కలుగజేసేటటువంటి చిన్నచిన్న నీటి వనరుల సౌకర్యము వెంటనే కల్గించి ఇతోధికంగా పంటలు పండించుకొనే దానికి సదుపాయములు చేయడము ప్రభుత్వము యొక్క పరమ ధర్మము అని నేను హృదయ పూర్వకంగా చెప్పుతున్నాను. ఈ వ్యవసాయ పంటలలో నేడు చెరకు పంట రైతుకు చాలా లాభదాయకమైనటువంటిది. కాని యీ చెరకు పంట నుంచి డబ్బు చేసుకొనడంలో అనేక యిబ్బందులు, అడ్డంకులు, అన్యాయాలు జరుగుతున్నాయి, పల్లెలనుంచి యీ చెరకును పంచదార మిల్లుకు తోలుకొనే వారి బాధ ఇంతా అంతా కాదు. దాని నిమిత్తం రెండేండ్ల క్రిందట టి. యన్. వెంకటసుబ్బారెడ్డిగారి అధ్యక్షతను ఒక కమిటీ ఏర్పర్చడం జరిగింది. ఆకమిటీ యీ పంచదార ఫ్యాక్టరీ వాండ్లను చెరకు పంట దార్లను కలసికొని ఇద్దరికి సమన్వయంగా, క్షేమదాయకంగా వుండే పద్ధతిన ఒక నివేదిక సమర్పించడము జరిగింది. నేనుకూడా ఆ కమిటీలోవుండి పనిచేశాను. కాని రెండేండ్లైనా కూడా దానిని ఒక బిల్లు రూపంగా తీసుకొని వచ్చి శాసనము చేయనందు వల్ల చెరకు పండించే రైతులు చెరకును ఫ్యాక్టరీలకు సరఫరా చేస్తున్నప్పుడు వాండ్లకు కలుగుతున్న కష్టాలు తొలగకుండా ఉన్నాయి. దానిని వెంటనే జరిపించి చెరకు పంటదారులకు సౌకర్యము కల్గించాలని వ్యవసాయశాఖా మాత్యులకు మనవి చేస్తున్నాను. తర్వాత చెరకుకు ధర చాలదు. చెరకు పండించడానికి ఖర్చులు చాల ఎక్కువైనాయి. చెరకు ధరను పెంచడానికి కేంద్రానికి మన ప్రభుత్వమువారు వ్రాస్తే కాని

గిట్టుబాటు కాదని మనవిచేస్తున్నాను. గౌరవనీయులైన మంత్రిగారు తోటల విష యమై చెప్పారు. జీడి మామిడి తోటల పెంపకం విదేశమారకద్రవ్యానికి అను కూలంగావుంటుందని దానికి చాల దోహదము యిచ్చామని అన్నారు, అది చాల మంచిది. అన్నిటికంటే ముఖ్యంగా తోటలనేటటువంటివి మనజీవితానికి అత్యవసరం. శ్రీకృష్ణ విజయంలో ఇట్లా చెప్పబడింది.

ఉ॥ మానవకోటికెల్ల గరిమందగు కృత్యములైన సప్తసం
తానములందుఁ దోఁటలు చితంబులు శాంతినికేతనంబులున్
జ్ఞాన విశేష భాగ్యవిలసన్మహనీయ విశుద్ధ కాంతి సం
స్థానములర్థసిద్ధి సుఖదంబులు వెండియు భోగయోగ్యముల్.

తోటలు అనేవి ఒక పెద్ద సంపద. తోటలవల్ల మానవులకు అనేక లాభాలున్నాయి. ఈ ఆరామకృషి అనేటటువంటి దానికి కూడా మనము దోహదమివ్వాలి.

తే। గీ। పెక్కు ప్రాణాలు జీవించుఁ బేర్మినెగడు
తోటలందు, విశిష్ట వస్తుయందు
పేరుకొందురు వానిని పెద్దలుమును
భుక్తిముక్తుల కవి దేవభూములెయని॥.

కనుక మన మంత్రిగారు తోటల విషయంలో ప్రోత్సాహము కలిగించి రైతులకుగాను అధికమైన లాభము వచ్చేటట్లు చేస్తారని నేను నమ్ముతున్నాను. వ్యవసాయ శాఖా మాత్యులు సహస్రహస్తములతో కష్టించిన రైతులకు సౌకర్యము కల్గిస్తూ వున్నందు లకు వారికి ధన్యవాదాలు అర్పిస్తూ నాకీ అవకాశమిచ్చినందులకు అధ్యక్షుల వారికి నమ స్కారము చేస్తున్నాను.

శ్రీ జి. గోపాలరెడ్డి(జనగాం-జనరల్) :— అధ్యక్షా వ్యవసాయ శాఖా మాత్యులు వ్యవసాయానికి, పశువైద్య, మత్స్య శాఖలాంటివి కొన్ని పద్దులు ప్రవేశపెట్ట డము జరిగింది. ప్రవేశ పెట్టుతూ వారు చాలసేపు రైతుల విషయంలో చాల తియ్యటి మాటలుచెప్పారు. అవి వినడానికి చాల సొంపుగానే వున్నవి. కాని నిజంగా వారు చెప్పే టటువంటి మాటలను బట్టి రైతులు ఎంతవరకు లాభ పడుతారో ఎంత పర్సెంటు మన ప్రజలకు దానివల్ల లాభము కల్గుతుందో చూడవలసి యున్నది. ఏదో కొంతమందికి తప్ప మిగిలినవాండ్లకు సరియైన విధంగా దానివల్ల లాభము లేదు. చాలమంది రైతులు తమ పంటలలోని చాల భాగము తమతిండి కొరకు ఎక్కువగా వుంచుకోవడము జరుగుతుంది. ఇతర అవసరాలకు కొద్దో గొప్పో అమ్ముకోవడము జరుగుతుంది. వాండ్లకు న్యాయమైన ధర రావలసియున్నదే కాని ఆ న్యాయానికి కొన్ని హద్దులుం డాలి. గిట్టుబాటు ధర అనే పేరుతో యీ రోజు మంత్రిగారు ఏ అభిప్రాయాన్ని ప్రకటిం

చారో దానివల్ల పెన్నేటటువంటి ఫలితమేమీ వుండదు. వారు ఆశించినటువంటి ఫలితము కొద్దిమందికి మాత్రమే దక్కుతుంది. ఇక యీ వ్యవసాయ పద్దులలో కేటాయించిన విషయాలనుచూస్తే యీ పద్దుకు చాల తక్కువగా కేటాయించడము జరిగిందని నేను భావిస్తున్నాను. ఎందుకంటే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎక్కువడబ్బు మన రెవెన్యూకు చేకూర్చేది రైతులే. వారియొక్క క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని మనము వ్యవహరించవలసిన అవసరము చాలావుంది ముఖ్యంగా యీ అధికాహారోత్పత్తిని దృష్టిలో పెట్టుకొని రైతుల క్షేమమును గురించి ఆలోచించవలసి వుంటుంది. కాబట్టి ఆ దృక్పథంతో చూచినపుడు యీ కేటాయించిన మొత్తము సరిపోదు. మంత్రిగారు ట్రాక్టర్లు, ఇంజన్ మోటార్ల విషయం చెప్పారు. వారు చెప్పిన లెక్కలను, ఇదివరకు కొన్ని ప్రశ్నలు అడిగినపుడు, ఇతర విధాలుగా వచ్చినటువంటి లెక్కలను చూస్తే ఇవి చాల స్వల్పమని, దానివల్ల మనము ఆశించే విధంగా అధికాహారోత్పత్తి పెరగదని నేను అనుకొంటున్నాను. ఈ ట్రాక్టర్లు ఏకొద్దిమందికి మాత్రమో అందుబాటులో వుంటాయి. ఇక సామాన్య రైతులకు అందుబాటులో లేకుండా వాటి రేట్లును చాలవరకు ఎక్కువగా పెట్టారు. ఎకరాకు 24 రూపాయలనుంచి 26 రూపాయలవరకు యీరేట్లు వున్నాయి. ఈవిధంగా ఎకరానికి 26 రూపాయలు యిస్తే మధ్యతరగతి రైతులు దానినుంచి లాభము పొందరని మనందరికీ తెలుసు. అందువల్ల ఏకొద్దిమందికో యీ ట్రాక్టర్లు ఉపయోగపడతాయి. ఆయిల్ ఇంజన్లు ఎలెక్ట్రిక్ మోటార్లు, మోటార్లు ఉంటే మధ్యతరగతి వారికి చాల ఉపయోగంగా వుంటుంది, కాని దురదృష్టవశాత్తు మనగ్రామాలలో ఎలెక్ట్రిసిటీలేదు. ఇక వ్యవసాయ శాఖవారు సరియైనవిధంగా పనిచేయడంలేదు. సంతృప్తికరంగా పని చేయడంలేదు. ఒక తాలూకాకు ఒక వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్ ఉంటాడు. ఆ వుద్యోగి తాలూకాలో తిరిగినట్లు కనబడదు. ఏకొద్దిమంది పెద్ద భూస్వాములలో అతనివల్ల లాభం పొందుతారుగాని సామాన్య రైతాంగానికి లాభం వుండదు. రైతులకు వ్యవసాయ శాఖ ఉద్యోగులవల్ల లాభంలేకుండా ఉన్నది. వ్యవసాయశాఖఅంటూ ఒకటి వున్నదని, దానివల్ల లాభంకలుగుతుందని చిన్న రైతులకు తెలియదు. రైతాంగంలో వ్యవసాయశాఖఉద్యోగస్థులచే ప్రభుత్వం తగినంత ప్రచారంచేయించాలి. అందువల్ల కొంతమందికి ఉపయోగం ఉంటుంది. ఈనాడు అట్టి ప్రచారమేమీ జరగడంలేదు. డెమాన్‌స్ట్రేటర్లు, ఫీల్డ్‌మన్, మేస్త్రీలు అనేవారెవరుకూడా రైతులకు సలహాలివ్వడం నేను చూడలేదు. వ్యవసాయరంగంలో నూతన పద్ధతులను చొప్పించడానికి వారు ప్రయత్నం చేయడంలేదు. వ్యవసాయాభివృద్ధికి వున్న అవకాశాలనుకూడా వారు ఉపయోగించుకోవడంలేదు. కాగితాలపైన వ్యవహారం జరగడం, ఉద్యోగుల నిమిత్తం డబ్బుఖర్చుకావడంతప్ప పనిమాత్రం జరగడంలేదు. పంటల తెగుళ్ల విషయంలో మందుల ఖరీదులు ఎక్కువగావున్నాయి కాబట్టి, రైతులు ఆ ధరలను

భరించలేరని తెగుళ్ల నిరోధానికివ్యవసాయశాఖవారు పూనుకోవడంలేదు. ప్రభుత్వ విధానమీవిధంగావుంటే వ్యవసాయాన్ని రైతాంగం మానుకోవాలనే ధోరణి ప్రబలు తుంది. మందులఖరీదులు ఎక్కువగావుంటే వాటిని తగ్గించడానికి మార్గాలు అన్వే షించాలి. మందుల ధరలు ఎక్కువగావున్నాయి కాబట్టి తెగుళ్లవచ్చి పంటలు పోయినాసరే అని ఊరుకోవడం మంచిదికాదు. మందులఖరీదులు తగ్గించడానికి గాని, రీసెర్చిచేసి తెగుళ్ల నిరోధానికి అవసరమైన పద్ధతులు అవలంబించడానికిగాని ప్రభుత్వం కృషిచేయాలి. తెగుళ్లవచ్చాయిగదా అని నిరుత్సాహపడి వ్యవసాయం మానుకోవడం దేశానికి అనర్ధదాయకం. హెచ్చుపంటలు పండించడానికి తెగుళ్లను నివారించడానికి ఏయే నవీన పద్ధతులవసరమో వాటిని ప్రయోగాత్మకంగా రైతులకు తెలియబరచాలి.

శ్రీ డి. రామబ్రహ్మం (కుప్పం) :- అధ్యక్షా, నేడు వ్యవసాయశాఖా మాత్యులు మన ఎదుటవుంచిన అయిదు డిమాండ్లనుకూడా నేను హృదయ పూర్వ కంగా బలపరుస్తున్నాను. వ్యవసాయశాఖామాత్యులు రైతుకుటుంబంలో పుట్టి, ఆ రైతు కున్నటువంటి ఇబ్బందులను ఆకళింపు చేసుకున్నటువంటి యువకులు. మెట్ట ప్రాంతాలలో, క్షామప్రాంతాలలో జన్మించి నటువంటివారు. వారు చేసినటువంటి దీర్ఘోపన్యాసంలో వున్నటువంటి విషయాలు వారు రైతుబాంధవులనటానికి తార్కాణం. ముఖ్యంగా అటవీశాఖలో వారు మంత్రివర్గానికి వచ్చిన తరువాత చేసినటువంటి మార్పులు పేదరైతాంగానికి చాలా మేలు కలుగ చేస్తాయి. రైతుల ఇబ్బం దులను గురించి, చాలా మంచి పద్ధతులను వారు ప్రవేశపెట్ట గలిగారు. మన ఆంధ్ర దేశంలో 24,700 చ.మై. విస్తీర్ణంగల అటవీ ప్రాంతమున్నది. దేశంలోని మూడవ వంతు విస్తీర్ణం అడవిగా వుండాలని ప్రభుత్వోద్దేశం. అయితే మన ఆంధ్ర ప్రదే శంలో వున్నటువంటి అటవీసంపద 10 శాతం మాత్రమే వున్నది. అడవులను మనమింకా అభివృద్ధి చేసుకోవాలి. అటవీ సంపద లేనప్పుడు దేశం సస్యశ్యామలంగా ఉండదు. వర్షాలుండవు, గ్రామాలలో పంటలుపండే అవకాశం పోతుంది. అడవు లను సక్రమమైన పద్ధతులలో పెంచుకోవాలి, గత రెండువందల సంవత్సరములనుండి మనదేశంలో ఒక పరిపాలనా పద్ధతి అలవాటు పడిపోయిన ఉద్యోగస్థులున్నారు. వారినందరిని ఏకకాలంలో తొలగించి వేయడం కష్టం. నూతన పరిస్థితులకు అల వాటు పడడానికి వారికి కొంత వ్యవధికావాలి. వారందుకు కృషిచేస్తున్నారుకూడా. అక్కడక్కడ కొన్ని లోపాలుండవచ్చు. ఈ మధ్యనే మన ప్రభుత్వం జమీం దారీ ప్రాంతాలను అడవులను స్వాధీనం చేసుకున్నది. జమీందారులకాలంలో వారుకొన్ని పద్ధతులను ఏర్పాటు చేశారు. ఆ పద్ధతులను గురించి యింతకుముందు శ్రీ రామకృష్ణరాజుగారు మాట్లాడారు. అటవీ ప్రాంతాలలోని రైతుల ఇబ్బందులను వారు ప్రభుత్వానికి ఎరుకపరచారు, అడవులలో రిజర్వులనీ, అన్ రిజర్వులనీ

రెండు రకాలున్నాయి. ఈ - అన్-రిజర్వులను ఎక్కువ చేస్తే తప్ప పల్లె ప్రజానీకం పశువులను, మేకలను మేపుకోడానికి వసతులులేకుండా పోతాయి. అందువల్ల అన్ రిజర్వులెక్కువగా వుండాలి. గ్రోమోర్ ఫుడ్ కాంపైన్ వచ్చిన తరువాత అన్ రిజర్వులు రెవెన్యూ డిపార్టుమెంటు క్రిందకు పోయినాయి. అందువల్ల ఈనాడు గ్రామాలకు ప్రక్కనే రిజర్వులేర్పడినాయి. అందువల్ల రైతులు చాలా ఇబ్బందుల పాలవుతున్నారు. మంత్రిగారు, మా జిల్లాలోని శాసనసభ్యులు, ఫారెస్టు అధికారులు మా జిల్లాలోని కొన్ని అటవీ ప్రాంతాలను చూడడం తటస్థించింది. ఎక్కడ లైన్లు మార్చాలో అక్కడ మార్పులు చేయడానికి మంత్రిగారు ఒక ఉత్తరువు జారీచేశారు. మేము కొన్ని అటవీ ప్రాంతాలను చూచినాము. అక్కడ చాలా భాగం సాగుచేయ బడుతున్నది. యీ విషయంలో ప్రభుత్వంది తప్పులేదని మా అభిప్రాయం. ఎంతో భూమిని రైతులు తాజేశారు. అందరూకూడా దున్నుకున్నారు. ప్రభుత్వం ఇప్పుడు అన్ రిజర్వులను ఎక్కువ చేసినాకూడా సాగుచేసే ప్రయత్నాలు జరగవచ్చు. ఫారెస్టు శాఖాధికారులు, మరికొందరు నానఫిషియల్సు కలిసి, ప్రభుత్వానికి ఒక రిపోర్టు పంపించాము. ఇప్పుడున్నటువంటి అన్ రిజర్వులేకుండా యింకా కొంత భూమి అన్‌రిజర్వుగా ఏర్పాటుచేసి, ఎవరూ సాగుచేయకుండా నిరోధించవలెనని కోరినాము. కమ్యూనల్ పోరంబోక్కుసు సాగుచేయకూడదని ఏవిధంగా బాన్ చేశారో, అదేవిధంగా అన్ రిజర్వులను కూడా సాగుచేయడం నిషేధించవలెనని చెప్పినాము, ఇందుకవసరమైన చట్టము చేయవలసినదనికూడా ప్రభుత్వాన్ని కోరినాము. ఐతే అడవులలోనికి మేకలను రానీయకూడదనే నిషేధమున్నది. ఐతే మేకలు ఉండకూడదని ప్రభుత్వ అభిప్రాయమా అని అడుగుతున్నాను. ఈ అభిప్రాయం చాలా పొరబాటు. మా ప్రాంతం చల్లటి ప్రదేశం. అక్కడ గొర్రెలు బ్రతక లేవు. మేకలు అక్కడ రైతాంగానికి ఎంతో అవసరం. మేకలువుంటేనే మంచి ఎరువు దొరుకుతుంది. ఆ ఎరువులు వడితేనేతప్ప పంటలు పండవు. అన్నీ మెట్టప్రాంతాలు, అక్కడ పంటలు పండించాలంటే ముఖ్యంగా ఎరువుకు మేకలుఉండాలి. మేకలను మేపుకొనుటకు ఫారెస్టులో కొంత రిజర్వుచేయాలి. కొన్ని బ్లాక్కు ఏర్పాటుచేసి ఆ సౌకర్యం ప్రభుత్వం కలుగజేయాలని మనవిచేసు కొంటున్నాను. ప్రభుత్వం, అడవులు పెంపకం చేసేవిషయంలో శ్రద్ధతీసుకొంటు న్నదని మంత్రిగారు చెప్పారు. కొన్నిచోట్ల జీడిమామిడి, సరుకుచెట్లు పెరుగుతాయి. మరికొన్నిచోట్ల జీడిమామిడిగాని, సరకుచెట్లుగాని పెంపకముచేయుటకు వీలులేని ప్రాంతాలు ఉన్నాయి. ఆ ప్రాంతాలలో మంచిచందనం వృద్ధి అయ్యే అవకాశాలు ఉన్నాయి. కంగుంది ఫారెస్టులో, మైసూరు సరిహద్దుల్లోని ఏ ఫారెస్టులో అయినాసరే మంచిచందనం పెంపకానికి వసతులు ఉన్నాయి. అటువంటి వసతులున్నచోట్ల చందనంచెట్లు పెంపకంచేయాలని మనవిచేస్తున్నాను. మైసూరు సరిహద్దుఅడవులలో లంటాడా (గబ్బుతీగె) చెట్లు విపరీతంగా పెరుగుతున్నాయి, అవి పెరిగేచోట,

ఏ యితర వృక్షాలూ మొలవడానికి వీలులేదు. ప్రొయ్యేకప్లైలకు ఉచితంగా తీసుకు పోవచ్చునని యీ మంత్రిగారు వచ్చిన తరువాత ఉత్తరువులు జారీచేశారు. అవి నశించేపరిస్థితిలేదు. ఈమధ్యన ఆంధ్రయూనివర్సిటీలోనో ఎక్కడనో యిచ్చిన ఉపన్యాసాలలో యీ చెట్లు కాగితపు పరిశ్రమకు ఉపయోగపడతాయని సలహా యిచ్చారు. ఆ విధంగా కాగితపు పరిశ్రమకు పనికివస్తాయేమో పరిశోధన చేయిస్తే బాగుంటుంది. కంచెకంపలు ఉచితంగా తెచ్చుకోవచ్చునని చెప్పారు. ఈ లంటాడా అడివికి చెరుపుచేస్తుంది. ఈ చెట్లపొదలలో ఏచెట్లూ మొలవవు. లంటాడా కంపలు ఉచితంగా తెచ్చుకొనుటకు ఆ కంచెకంపల లిస్టులో లేదని అటవీశాఖ ఉద్యోగస్థులు నిషేధిస్తున్నారు. దానిని ఉచితంగా తెచ్చుకొనుటకు, ఆ లిస్టులో చేర్పించాలని కోరుతున్నాను.

ఈ మంత్రిగారు వచ్చిన తరువాత పల్మనేర్‌లో కేటిల్ బ్రీడింగ్ సెంటరు ఏర్పాటుచేశారు. మంచి మంచి పశువులు, కోడెలు తయారవుతున్నాయి. పశుశాల లకు బిల్డింగ్స్‌లేవు. పూరికొంపల్లో ఉన్నాయి. అక్కడ కావలసిన కొట్టాలకు, పర్మనెంటు బేసిస్‌మీద బిల్డింగ్స్ కట్టించాలని తమద్వారా ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను

సామాన్యంగా ఆహారధాన్యాల విషయంలో ధరలు పెరిగినవని చెప్పుట అలవాటు. వాస్తవమే, ధరలుపెరిగాయి. కాని యితర వస్తువుల ధరలుకూడా పెరుగుతున్నాయి. ఇదిఎల్లా ఉన్నదంటే పెళ్లిఅయితేగాని పిచ్చికుదరదు పిచ్చికుదిరితేగాని పెళ్లికాదు అనే సామెతలా ఉన్నది. ప్రత్యేకం ధాన్యంధర తగ్గాలంటే ఎట్లాగు? ప్రతివస్తువు ధర పెరిగింది. ఆహారధాన్యాల ధరకూడా పెరిగింది.

మా జిల్లాలో యీనాడు పడమటి తాలూకాలో కరువు పరిస్థితులు ఏర్పడినాయి. అక్కడ తక్కావీ బకాయీలు, ఇంజిన్‌లోన్సు బకాయీలూ ఉన్నాయి. ఏ పెద్ద రైతుకూడా తీర్చుకొనే స్థితిలో లేకుండా ఉన్నాడు కాబట్టి, అది కరువు ప్రాంతంగా పరిగణించి ముదరాయిప్పించే ఏర్పాటుచేయాలని మనవిచేస్తున్నాను.

శ్రీ ఆర్. జగన్నాధం (నరసన్నపేట) :- అధ్యక్షా, వ్యవసాయ శాఖామాత్యులు ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తూ ప్రభుత్వ దృష్టికి కొన్ని సూచనలు చేస్తున్నాను. నా మిత్రులు చాలామంది వ్యవసాయమును గురించి చాలా విషయాలు చెప్పారు. ముఖ్యంగా మనరాష్ట్రం వ్యవసాయరాష్ట్రం. నూటికి 80 మంది వ్యవసాయంమీద జీవిస్తున్నారు. వ్యవసాయములో నూతన పద్ధతులు, శాస్త్ర పద్ధతులు ప్రవేశపెట్టి అధికాహారోత్పత్తి చేయమని మన ప్రభుత్వం ప్రబోధం చేస్తున్నది. అందుకు తాలూకా హెడ్‌క్వార్టర్సులో డిమాన్‌స్ట్రేటర్సును పెట్టారు. తాలూకాలో 200, 300 గ్రామాలు ఉంటే, ఆయన ప్రతిగ్రామానికి పోలేక కొన్ని గ్రామాలకే పోయి ప్రబోధము చేయుటచేత అందరికీ శాస్త్రపద్ధతులు పూర్తిగా తెలియుటలేదు.

వ్యవసాయము చేయటానికి అనేక కొంతలు యింకా ప్రభుత్వం పూర్తిచేయనందున అధికాహారోత్పత్తి చేయుటకు అవకాశం లేకుండా ఉన్నది. రైతులకు సకాలములో నీటిసౌకర్యాలు లేకుండావున్నాయి, ఇంకా ఎరువుల సౌకర్యాలు లేక, ఏసాయిల్‌లో ఏ విత్తనాలు అభివృద్ధికరమైనవి వేయాలి అనే విజ్ఞానము లేక పల్లెసీమలలోని వారున్నందున, ఎక్కువ ఉత్పత్తి కష్టతరముగా ఉన్నది. వ్యవసాయదారులకు పనిముట్లు, ఎరువులు సకాలములో అందె సౌకర్యములు నేటివరకు కలుగజేయనందు వల్ల అధికోత్పత్తి జరుగుటలేదు. వ్యవసాయానికి కావలసిన వాటిధరలు విపరీతంగా పెరిగిపోయినాయి. రైతుపండించే ప్రతివస్తువు ఎక్కువ కిమ్మతు అవుతున్నదని పట్టణములలోని ప్రజలు అనడం సహజము. ఎవరి ఈతి బాధలు వారు చెప్పుకొనుట సహజమైన ధర్మం. పల్లెలలో వుండి వ్యవసాయము చేయటం, అది దైవసహాయం వల్ల అయ్యేపనిగాని, పూర్తిగా మనకృషినే నమ్ముకొనుటకు అవకాశం లేదు. చాలా కష్టసాధ్యమైన సమస్య. విశాఖపట్టణం జిల్లా వెనుకబడిన ప్రాంతం. మైనరు ఇర్రిగేషన్ సౌకర్యాలు కూడా లేవు. మెట్ట ప్రదేశాలు ఉన్నాయి. అక్కడ వర్షాధారముపల్లనే పంటలు పండించాలి. ఇంకే యితర ఆధారాలు లేవు. విద్యుచ్ఛక్తికూడా లేదు. ప్రభుత్వం అటువంటి సౌకర్యాలేమీ కలుగ జేయలేదు. చిన్నచిన్న వాగులు, గడ్డలు, చెరువులు ఉన్నాయి. ప్రాముఖ్యమైన నదులు లేవు. శారదానది ఉన్నది. అక్కడ ప్రజలు ఒక చిన్న ప్రాజెక్టు కట్టమని వత్తిడి చేసినా, ప్రభుత్వం ఇన్‌వెస్టిగేషన్ చేసికూడా, రెండవ పంచవర్ష ప్రణాళికలో దాని సూచన ఎక్కడా కనిపించక పోవుటవల్ల చాలా విచారిస్తున్నాను. ఆ ప్రదేశాలలో చెరుకుపంట విపరీతము. చెరుకుకు, డిసెంబరు తరువాత నీరు కావాలి. ఫిబ్రవరి, మార్చిలో గాని ఫలితము యివ్వదు. సకాలములో నీటి సౌకర్యము లేక చెరుకువల్ల పూర్తిఫలితము తీసుకోలేకుండా ఉన్నారు. చాలా నష్టము కలుగుతోంది. ఎంతో కష్టపడి పండించిన జాగరీ రైతు తను అమ్ముకొనే సమయంలో సరిగా ధరలు లేకుండా ఉన్నాయి. అనకాపల్లి తీసుకు వెళ్ళి అమ్మాలి. రైతువద్ద ఉన్నంతకాలం ధర ఉండదు. వర్తకుల చేతుల్లోపడి రైతుకు ధర తక్కువరావటం వల్ల అన్యాయం జరుగుతోంది. రైతుకు సరైన ధర వచ్చుటకు ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవాలి. రైతు అమ్ముకొనే కాలంలో సరైనధర వచ్చే ఏర్పాటు చేయాలి. రైతులకు ముఖ్యంగా వ్యవసాయమునకు కావలసిన సౌకర్యములు కలుగ జేయవలెనని మనవిచేస్తూ, యీ అవకాశం యిచ్చినందుకు అధ్యక్షుల వారికి అభినందనలు తెలుపుతున్నాను.

*శ్రీ కె. సుదర్శనరావు ( పాల్వంచ ) :— అధ్యక్షా, వ్యవసాయశాఖామాత్యులు ప్రతిపాదించిన డిమాండ్లను నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. మన ఆంధ్రప్రదేశ్‌కు వ్యవసాయము గురించి సమగ్రంగా తెలిసిన వ్యవసాయశాఖ మంత్రి ఉండటం నిజంగా చాలా అదృష్టమైన విషయమని అనుకొంటాను. మన వ్యవసాయశాఖామాత్యులు ప్రతి విషయాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకొని సక్రమంగా

ఇండస్ట్రియల్ సెంటర్స్‌లో ఆర్గనైజ్డ్ యూనియన్స్ ఉన్నచోట చీఫ్ గ్రెయిన్ షాప్స్ పెట్టి, వారికి చౌకగా ఆహార పదార్థాలు అందేటట్లు చేయవలసిందిగా కోరుతున్నాను. ఇప్పుడు నేను చెప్పిన అన్ని పాయింట్స్ గురించి ప్రభుత్వం దీర్ఘంగా ఆలోచన చేసి, వాటిని అమలు జరుపుతారని ఆశిస్తున్నాను.

ఇవాళ ప్రతివారు తమ శ్రమకు తగిన ప్రతిఫలం కావాలని కోరుకొంటున్నారు. అలాగే రైతులుకూడా తమ కష్టానికి సక్రమమైన ఫలితం రావాలని తలుస్తున్నారు. ఏ విధంగా అయితే ఇతరులు తమ శ్రమకు, తమ కష్టానికి తగిన ప్రతిఫలం రావాలని కోరుకొంటున్నారో, అదే విధంగా రైతులుకూడా తమ కష్టానికి ప్రతిఫలంగా సక్రమమైన ధరలు కావాలని చెబుతున్నారని మనం ఆర్గ్యుమెంట్ చేసి ఇతరులను ఒప్పించటానికి వీలౌతుంది. ఈ మధ్య తిమ్మారెడ్డిగారు చేసిన ఉపన్యాసాలను కొంతమంది విమర్శిస్తున్నారు. వారి విమర్శలు చూసిన తరువాత నాకు అనిపించింది· "తిమ్మారెడ్డిగారికి బ్రహ్మాండమైన భూమి ఉన్నదా, మరి ఆయన ఎందుకు ఈ విధంగా చెబుతున్నారు, వారిపైన చేసిన విమర్శలలో నిజం ఉన్నదా" అని ఆలోచించాను. నాకు అర్థమైనంతవరకు ప్రతివాడికి తాను కష్టపడినదానికి తగిన ఫలితం రావాలని ఉంటుంది. ఆ విధంగా అనుకోవటం సహజం. ఆ విధంగా అడగటంకూడ న్యాయం. "రైతులు పేదవారా, రైతుకు ఎన్ని ఎకరాలు ఉన్నాయి, అతనికి పది ఎకరాలు ఉన్నాయా, ఇరవై ఎకరాలు ఉన్నాయా, రెండొందలు ఎకరాలు ఉన్నాయా" అన్నది వేరే విషయము. కావాలంటే, వారి ఇన్‌కంపైన పన్ను వేయవచ్చును. ఉన్నవారిపైన ఎక్కువ పన్నువేసి పేదవారిపైన తక్కువపన్ను వేసి మనధ్యేయమైన సోషలిస్టిక్ పేట్రన్ ఆఫ్ సొసైటీని ఏర్పాటు చేయవచ్చును. ఆ విధంగా దేశంలో పేదతనాన్ని రూపుమాపటానికి ప్రయత్నం చేయవచ్చును. కాని ఇవాళ మనం ఫండమెంటల్‌గా ఆలోచించవలసింది ఏమిటి? ఇవాళ ప్రతి వ్యక్తి తను పడిన కష్టానికి, తగిన ఫలం రావాలని అడుగుతాడు. అదేవిధంగా ఈనాడు రైతు తన కష్టానికి, తన శ్రమకు, తన ఫలసాయానికి తగినటువంటి ధరను ఆశించటం అన్యాయం కాదు. ఇవాళ ప్రతివాడు తను ఉత్పత్తి చేసినదానిపైన, తను కష్టపడిన దానిపైన న్యాయమైన ఫలితాన్ని కోరటం సమంజసమైనదని మనం అనుకొంటున్నాము.

ఇవాళ మనకు డెయరీఫారమ్స్ లేకపోవటంవల్ల, హైదరాబాదు, శికిందారాబాదు, బెజవాడలాంటి పెద్దపెద్ద పట్టణాలలోని ప్రజలు చాలా ఇబ్బందులు పడుతున్నారు. కాబట్టి మన ప్రభుత్వం బొంబాయిలోలాగ, పెద్ద పెద్ద పట్టణాలలో డెయిరీఫారమ్స్ పెట్టి, వాటికి సంబంధించిన మిల్క్‌ప్రోడక్ట్స్ తయారు చేసేటటువంటివాటిని ఎంకరేజ్ చేసి, వాళ్ళకు లోన్సు ఇచ్చి, సబ్సిడీలు ఇచ్చి, పట్టణాలలోని ప్రజలయొక్క ఇబ్బందులను తొలగించటానికి ఆలోచించవలసిందిగా కోరుతున్నాను.

ఫారెస్టు డిపార్టుమెంట్‌లో కరప్షన్ చాలా ఎక్కువగా ఉంది. ఆ డిపార్టు మెంట్‌లో లక్షలరూపాయలు, వేలరూపాయలు యీ కరప్షన్‌ద్వారా సంపాదిస్తున్నారు. ఒక్క రేంజరేకాదు, మామూలుగా ఫారెస్టుగార్డుగా ఉండేవాడుకూడ చాలా సంపాదిస్తున్నాడని ప్రతీతి ఉన్నది. అది నిజం అయినా, కాకపోయినా ఫారెస్టు డిపార్టు మెంటులో కరప్షన్ బాగా ఉన్నది అనిపిస్తుంది. ఈ కరప్షన్‌కు కారణం ఏమిటి? కరప్షన్ పూర్తిగా తీసివేస్తే మంచిదే. అది సాధ్యం కానప్పుడు, కనీసం కొంత తగ్గించటానికైనా ఏమైనా మార్గాలున్నాయా అన్నది ఆలోచించాలి. "ఈ కరప్షన్ పెరగటానికి కంట్రాక్టర్స్ స్వలాభం ఎంతవరకు తోడ్పడుతుంది, ఆక్షన్ పద్ధతి మూలకంగా కరప్షన్ పెరుగుతోందా" అన్నది చూడాలి. వేల్యుయేషన్ చేయటానికి రేంజర్ వెళ్ళినపుడు పదివేల రూపాయల కూపు ఉన్నదానిని రెండువేల రూపాయలకే వేల్యుయేషన్ చేసి ఇచ్చినట్లయితే, వారికి డబ్బు ఇస్తున్నారా, అన్నది చూడాలి. వేల్యుయేషన్ పద్ధతిలో పొరపాటు ఉందా, ఆక్షన్ విధానం సక్రమమైనదేనా, అన్నది పరిశీలించి, ఫండమెంటల్‌గా ఆలోచించినట్లయితే, ఆ పొరపాట్లను దూరం చేయటానికి వీలౌతుంది.

ఫిషరీస్ డిపార్టుమెంటు టెక్నికల్‌గా చేపల అభివృద్ధికొరకు పూనుకొంటే మంచిదే. ఇవాళ ఆక్షన్ మొదలగు (ఫిషరీస్) డిపార్టుమెంట్ ఎడ్మినిస్ట్రేషన్‌ను రెవిన్యూ డిపార్టుమెంటుకు అప్పగించి చిన్న చేపలను, పెద్ద చేపలను, ఇంకా మేలు రకం చేపలను అభివృద్ధి చేయటానికి టెక్నికల్‌గా ఆలోచించటానికి యీ ఫిషరీస్ డిపార్ట్‌మెంట్ పూనుకుంటె ఈ డిపార్టుమెంటు మంచిగా, సమర్ధవంతంగా పనిచేయటానికి వీలౌతుందేమో మంత్రిగారు ఆలోచించవలసిందిగా కోరుతున్నాను. చేపలుపట్టే వారికి సహకారసంఘాలు ఏర్పాటుచేయాలి. ప్రభుత్వ డబ్బును దుర్వినియోగం చేయటానికి సహకార సంఘాలు పనిచేయకూడదు. ముదిరాజులకు, గంగపుత్రులకు కో-ఆపరేటివ్ సొసైటీలు, ఏర్పాటు చేసి వాళ్ళలో ఉన్న నిరుద్యోగాన్ని తొలగించి, ఆసొసైటీలు సక్రమంగా పనిచేసేవిధంగా చేయటానికి ప్రయత్నించ వలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను.

బావుల క్రింద వ్యవసాయం చేసే రైతులకు తోడ్పడ వలసిందిగా కోరుతున్నాను. బావుల క్రింద వ్యవసాయం చేయటానికి రికరింగ్ ఎక్స్‌పెండిచర్ కూడ ఉండదు. చాలా కొద్ది డబ్బుతో ఎక్కువ భూమిని సాగులోకి తీసుకరావటానికి అవకాశం ఉంటుంది. వెల్‌సింకింగ్ సబ్సిడీ క్రింద కేంద్రప్రభుత్వం నుండి ఎక్కువ డబ్బు తీసుకొని, రైతులకు సహాయం చేయవలసిందిగా కోరుతున్నాను.

ఎగ్రికల్చరల్ డిపార్టుమెంట్‌లోని వర్కర్సు గురించి చెబుతాను. ఎగ్రికల్చరల్ డిపార్టుమెంటులో ఫీల్డ్‌వర్కర్సు ఉన్నారు. వాళ్ళ పరిస్థితి చాలా అధ్వాన్నంగా

ఉంది. ఆ కేంద్రాలు వరంగల్‌లో, హిమాయత్‌సాగర్‌లో ఉన్నవి. ఆ కేంద్రాలలో పనిచేస్తున్న కార్మికుల పరిస్థితి అధ్వాన్నంగా ఉన్నది. స్వయంగా గవర్నమెంట్ ఎంప్లాయర్‌గా ఉన్నటువంటి పరిస్థితిలో, ఆ కార్మికుల పరిస్థితులు విచారించి, వారికి న్యాయం కలుగజేయటం అవసరము. వాళ్ళు చాలా పేదవాళ్ళు, వారికి నెలకు 30 రు. ల జీతంకూడా లేదు. వాళ్లు టెంపరరీగా పనిచేస్తున్నారు. వాళ్ళకు ఏమీ సెక్యూరిటీ లేదు. వారిని గురించి మంత్రిగారు విచారించాలని కోరుతున్నాను. అయితే రైతులయొక్క ధాన్యంపైన ధరలు పెరగాలన్నప్పుడు, వాటిప్రభావం బీదవాళ్ళపైన పడకుండా, ఇండస్ట్రియల్ సెంటర్స్ ఉన్నచోట అక్కడి వర్కర్స్ యూనియన్స్‌కు యీ చీప్‌గ్రెయిన్‌షాప్స్ అప్పగిస్తే మంచిది. వాళ్ళచేత ఆ షాప్స్ రన్‌చేయిస్తే బాగుంటుంది. అందుకు కార్మికులు ఏమీ అభ్యంతరం చెప్పరు. కష్ట పడుతున్న రైతుకు తగినఫలితం రావటానికి, ఫ్యాక్టరీల్లో పనిచేసే శ్రమజీవికి అభ్యంతరం ఉండవలసిన అవసరం ఉండదు. కష్టపడి ఫ్యాక్టరీల్లో పనిచేసేవారు శ్రమజీవులు. అదేవిధంగా రోజంతా కష్టపడి పండించే రైతులు శ్రమజీవులు. ఆ శ్రమజీవికి లాభం కలిగితే, యీ శ్రమజీవికి ఏవిధమైన అభ్యంతరం గాని, ఆక్షేపణగాని ఉండటానికి అవకాశం లేదు. ధరలు విపరీతంగా పెరిగి ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు తమకు వచ్చే కొద్దిజీతంతో ఆహారపదార్థాలు కొనుక్కోలేని పరిస్థితులు ఏర్పడినపుడు, తమ కుటుంబాలను పోషించుకోలేని స్థితి ఏర్పడినపుడు విపరీతమైన చిక్కులు ఏర్పడతాయి. పరిస్థితులు అంతవరకు రానివ్వకూడదు. రైతులకు సక్రమమైన ధరలు రావాలి. పరిశ్రమలలో పనిచేసే కార్మికులకు చీప్ గ్రెయిన్ షాప్స్‌పెట్టి ఆహారధాన్యాలు సప్లయి చేయటానికి పూనుకొంటే, మనం అన్నిపక్షాలవారికి న్యాయం చేసినట్లవుతుంది. అప్పుడే కాంగ్రెసు ధ్యేయమైన సోషలిస్టిక్ పేటర్న్ ఆఫ్ సొసైటీని స్థాపించుకోవటానికి ప్రయత్నంచేసినట్లు అవు తుంది. అప్పుడే "కేవలం భూస్వాములకొరకు మాత్రమే మనం రైతులకు రీజనబుల్ ప్రయిసెస్ ఉండాలని అనటంలేదు; పేద రైతులకు, అందరికికూడా న్యాయం కలిగేందుకు, రీజనబుల్ ప్రయిసెస్ ఉండాలని అంటున్నా"మని మనం నిరూపించటానికి అవకాశం ఉంటుందని నేను భావిస్తున్నాను. నాకు యీ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులకు నా ధన్యవాదాలర్పిస్తూ సెలవు తీసుకొంటున్నాను.

శ్రీ యన్. సి. శేషాద్రి (రాయదుర్గం):— అధ్యక్షా, గౌరవనీయులైన వ్యవసాయశాఖామాత్యులు వ్యవసాయము అనే పద్దు క్రింద 2,83,86,400 రూపాయలు Capital outlay on Agricultural resources and improvements అనే పద్దు క్రింద 62,62,000 రూపాయలు కావాలని Demand ప్రతిపాదించారు. గడచిన నాలుగు అయిదు సంవత్సరాలుగా ప్రతిసంవత్సరము వ్యవసాయము అనే పద్దు క్రింద ఖర్చు చేయడము జరుగుతున్నది. ఈ దినము యీ డిమాండుమీద మాట్లాడిన సభ్యులలో

చాలా మంది యీ సంవత్సరము యిదివరకటికన్న చాలా తక్కువ సొమ్మును కేటా యింపడము జరిగిందని అన్నారు. ఈ పద్దుక్రింద శాంక్షనుచేసినసొమ్ము సక్రమ పద్ధతిలో ఖర్చుచేస్తున్నారా, లేదా, ఖర్చుకు తగినట్లుగా రైతులకోర్కెలు తీరుతున్నవా లేదా అనే సంగతులు మనము ఇప్పుడు చర్చించుకుంటే చాలా మంచిది అని నేను అనుకుంటున్నాను. గడచిన మూడు, నాలుగు సంవత్సరములుగా యీ పద్దుకు సంబంధించిన డిమాండు చర్చకు వచ్చినప్పుడల్లా తాలూకా కేంద్రాలలో Agriculture Demonstrators వెళ్లి రైతులకు ఏలాంటి సలహాలు, సహాయము ఇవ్వవలసి యున్నదో అలాంటివి యేమి జరగడములేదని మంత్రిగారి దృష్టికితేవడము జరిగింది. పరిస్థితులు యథాప్రకారముగానే ఉండిపోతున్నవి. ఈ Demonstrators తమకు ఉన్న బాధ్యతలు ఎట్టివో గుర్తించినట్లు కన్పించదు. వారికి ఆఫీసుపనులతోనే సరిపో తున్నది. ఇక తాలూకాలో ఉన్న రైతులకు వారు వెళ్లి సలహా ఇవ్వటానికి టైమ్ కవిపించకపోవడమే కారణమని గుర్తించవలసియున్నది. వీరికి ఆఫీసులో పనిచేయ టానికి ఒక్క Lower Division Clerk ను మాత్రమే యిస్తున్నారు ఈ clerk Demonstrator కు సహాయము చేస్తూవుంటాడు. Demonstrator ఎంతసేపటికినీ ఆఫీసు correspondence, returns వగైరాలు చూచుకోవడముతోనే సరిపోతున్నది. ఇక బైటకుపోయి out door work చేయటానికి టైము ఏమాత్రము ఉండదు. ఈ Demonstrators ఏదో B. Sc. degree ని సంపాదించుకొని Demonstrator పదవికి నియమింపబడుతున్నారు. అసలు వీరిని appoint చేయడము ఆఫీసులో కూర్చుని పనిచేయుటకేనా అని అడుగుతున్నారు. ఈవిధముగ పరిస్థితులుండడము వల్ల, యీ Demonstrator అనే పదవి ఎందువల్ల ఉంచబడిందో, అందుకు ఉప యోగపడడము లేదు. ఏదో ఒక upper division clerk ను ఆఫీసులో వేస్తే ఆయన యీ పని అంతాచూచుకుంటూఉంటే, Demonstrator out door work చూడగలడు. ఆవిధముగ ఏర్పాటుచేస్తే, Demonstrator చేయవలసినది చేస్తున్నట్లు అవుతుంది. ఇప్పుడు ఆవిధముగ జరగడములేదుగనుక మంత్రిగారు యీ విష యము గుర్తించవలసినదిగా కోరుతున్నారు. పల్లెసీమలలో పంటలకు తెగుళ్లు వచ్చి పంటలుపాడైపోయే పరిస్థితివచ్చినప్పుడు, యీ తెగుళ్లను నివారించటానికి Demons-trator యొక్క సలహా ఎంతైనా అవసరముంటుంది. Demonstrator ఊరూరు తిరిగి రైతులకు కావలసిన సహాయము, సలహాలు అందజేయవలసిన అవసరం ఉన్న దని మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. ఇదిగాక ఇంకొక విషయముకూడా మంత్రి గారు పరిశీలించవలసియుంటుంది. మన రాష్ట్రములో ఈ Demonstrators కు జీతాలు 100 రూ॥ల నుంచి 220 రూపాయలవరకు యిస్తున్నారు. ఇటీవల మద్రాసు ప్రభుత్వంవారు అక్కడ Demonstrators కు జీతాలు రు. 135-5-200-10-270 స్కేలుతో appoint చేస్తున్నారు. అలాంటి స్కేలు మన రాష్ట్రములో

కూడా పెట్టకపోవడము చాలా విచారకరముగ ఉన్నది. Demonstrator పదవి కొరకు వారు Technical subjects అన్నీ pass అయి డిగ్రీలు సంపాదించుకొని వస్తున్నప్పుడు వారికి తగిన జీతాలు, యితర రాష్ట్రములలో యిచ్చేమాదిరిగానైనా యివ్వకపోతే ప్రోత్సాహకరముగా ఉండదు రైతులు అధికపంట పండించటానికి ఈ Demonstrators యొక్క సలహాలు ఎంతో అవసరముగ ఉంటాయి. అందువల్ల ఈ Demonstrators యొక్క ఉపయోగము ప్రభుత్వము గుర్తించి, వీరికి తగు స్కేలులో జీతము ఇవ్వాలని అంటున్నాను. మద్రాసు ప్రభుత్వము యీ పదవులకు జీతాలు upgrade చేసినప్పుడు యీ ప్రభుత్వము కూడ upgrade చేయడము అవసరము. మనరాష్ట్రములో Agriculture Demonstrators సుమారు 200, 250 మంది దాకా ఉన్నారు. వీరిలో చాలామంది 9 (A) (1) రూలు క్రిందనే పని చేస్తున్నారు. ఆ విధముగ పనిచేస్తూ సుమారు 7, 8 సంవత్సరాలు Service put up చేసినవారు ఉన్నారు. ఈ 7, 8 సంవత్సరాలు ఒక్క increment కూడా తెచ్చుకోలేదు. ఇది చాలా హృదయవిదారకంగాను, శోచనీయముగాను ఉన్నది. 7, 8 సంవత్సరాలు పనిచేసి, service లో red-entry కూడ సంపాదించుకున్నను. వారికి ఒక్క increment కూడ లేకుండా ఉన్నది Confirmation అనేది కూడా లేదు. ఇప్పటికినీ వారు 9 (A)(1) Candidates గానే ఉంటున్నారు. వారిక్రింద మేస్త్రీలుగా పనిచేసినవారు Demonstrators పదవిలోకి పోయి Degree లు ఉన్నవారికంటె seniors అవుతున్నారు. ఇలాంటి పరిస్థితులు జరుగుతూంటే, ఇక వీరికి ఉత్సాహము ఉండవలెనంటే, దుర్లభమే. తెగుళ్ళ విషయములో కొన్ని సలహాలు ప్రభుత్వానికి యివ్వదలచుకున్నాను. మానవకోటికి ఎన్నిరకముల జబ్బులు వస్తూ ఉంటాయో, పంటలకు కూడ అదేవిధముగ రకరకాల జబ్బులు వస్తూ ఉంటాయి. ఈ తెగుళ్ళను నివారించటానికి నాలుగు జిల్లాలకు చేర్చి ఒక ఆఫీసరును నియమించినట్లుగా తెలుస్తున్నది. ఒక్క ఆఫీసరు నాలుగు జిల్లాలు తిరగాలంటే, ఈయన రైతులకు ఎంతవరకు ఉపయోగ పడుతాడో కూడ ప్రభుత్వము గుర్తించినట్లు లేదు. తెగుళ్ళ నివారణ క్రింద యీ బడ్జటులో 2,93,000 రూపాయలు కేటాయించారు. ఈ సొమ్ము నాలుగు జిల్లాల మీద ఏ మాత్రము చాలదు. ఈ సొమ్ము ఆయన తిరగటానికి బత్తాక్రిందనే సరిపోతుంది. పైగా ఆయన గ్రామగ్రామాలకు వెళ్ళి సలహా యిస్తాడన్నమాట శుద్ధ పొరబాటు. ఏదో జిల్లా కేంద్రాలకు వెళ్ళడము జరుగుతుందే కాని, రైతులకు సలహా యివ్వగలడా అని ప్రశ్నిస్తున్నాను. వీరు నిజంగా pests control చేయగలరా అని నాకు అనుమానముగా ఉన్నది. అందువల్ల యీ పద్ధతి సరియైనది కాదంటున్నాను. ఒక్కొక్క తాలూకాను మూడు కేంద్రాలుగా చేసి ఒక్కొక్క కేంద్రములో మూడేసి sprayers చొప్పున supply చేసి, గ్రామాలలో ఉపయోగిస్తే pests నివారించటానికి వీలు అవుతుంది. ముఖ్యంగా పంటసమయంలో కేవలము

యీ hand sprayers తో ఎంతవరకు పనిజరుగుతుంది ? Hand sprayers తో ఒక్కొక్క దినమునకు ఎనిమిది గంటలు పనిచేస్తే 1½ ఎకరాకంటే ఎక్కువగా spray చేయటానికి పీలుండదు. కాబట్టి ఇది కూడ చాలదని నా అభిప్రాయము. వీటికి తోడు Power sprayers కూడ supply చేయవలసి ఉంటుంది. Power sprayer తో దినము ఒకటికి 20 ఎకరములవరకు spray చేయటానికి వీలుంటుంది. కాబట్టి కనీసము ఒక్కొక తాలూకాకు కొన్ని Power sprayers కూడ సప్లయి చేయడము అవసరము. ఇదివరకు మనము మద్రాసు రాష్ట్రములో ఉన్నప్పుడు ఈ Insecticides, sprayers, green manure seeds, ఇలాంటివి అన్ని half subsidy rates లో యివ్వడము జరుగుతూ వచ్చింది. ఇప్పటికినీ యీ పద్ధతి మద్రాసు రాష్ట్రములో అమలులో ఉన్నదనుకుంటున్నాను. రాష్ట్రములో అధికోత్పత్తి జరగాలని ప్రభుత్వానికి వాస్తవముగ ఉద్దేశ్యము ఉన్నట్లైతే, అక్కడ మాదిరిగ Insecticides, Pesticides, green manure seeds, యిలాంటివి అన్ని half-subsidy rates లో రైతులకు సప్లయి చేస్తే, యీ తెగుళ్లు రాకుండా prevent చేయటానికి అనుకూలముగ ఉంటుంది. కాకపోతే యీ తెగుళ్లు పొలములకు అంతటికి పాకి, పంటలు నాశనము చేయడమే అవుతుంది. పండే పంటలో సగముకూడ దక్కకుండా పోతుంది. ఈ సూచనను మంత్రిగారు గమనిస్తారని ఆశిస్తున్నాను.

మరొక విషయము ఉన్నది. Agriculture Engineering క్రింద 50,91,300 రూపాయలు అందులో Lorries, Lorry transport క్రింద 2,27,000 రూపాయలు, Oil Engine, Pumping Sets installation క్రింద 2,94,000 రూపాయలు బడ్జటులో కేటాయించినట్లు కనబడుతున్నది. Agriculture Engineering Department లో దాదాపు యాభై అరవై లక్షల రూపాయలు ఖర్చు చేస్తున్నప్పుడు, ఆ డిపార్టుమెంటు వారివల్ల ప్రజలకు రైతులకు ఎంతవరకు సహాయము లభిస్తున్నదిన్నీ, కొంచెము దీర్ఘాలోచన చేయవలసి యున్నది. నాస్వంత అనుభవమును గురించి ఉదహరణగా మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. నాస్వంత పొలము రాయదుర్గములో ఉన్నది. పూర్వము అది బళ్లారి జిల్లాలో ఉండేది. అప్పుడు పంటకొరకు నీరు సప్లయి కావటానికి Agriculture Department నుంచి ఒక pumpset తెచ్చాను. దాని వెంబడి Departmental Supervisor కూడ వచ్చారు. ఆ pumpset ఏదో కారణము వల్ల start కాలేదు. వారేదో Internal cumbustion Engines ను గురించి theory మాత్రము చదువుకుని ప్యాసు అయివస్తూ ఉంటారుగాని, practical knowledge ఏ మాత్రము లేకుండా వస్తారు—అది start చేయటం తెలియక Ignition paper ఉంచేగాని అది start చేయటానికి వీలు కాదని అది తేవటానికి తిరిగి బళ్లారి వెళ్లాడు. అధి blotting paper ను petrol తో తడిపి start చేయండి, start అవుతుంధని చెప్పినాగూడ నామాట వినక వెళ్లాడు. ఆయన వచ్చేలోగా నేను, నా పంటలుఎండి

పోయే పరిస్థితిగా ఉంటే, అవసరమును బట్టి నేనే ఇంజను start చేసి work చేయించాను. ఆయన వచ్చి, నాకు తెలియకుండా, నా పర్మీషను లేకుండా ఎందుకు start చేసారు. మిమ్ములను చార్జీ చేస్తానని పైకి రిపోర్టు వ్రాస్తానని కోపగించుకుని వెళ్లాడు. దీనివల్ల ఏమి తెలుస్తున్నదంటే వాళ్లు ఏమాత్రము Practical knowledge లేకుండా theory మాత్రము చదువుకొని, ప్యాసు అయి డిగ్రీలు చేతబట్టుకుని వస్తారు. కాని దీనికి practical knowledge కూడ అవసరము. నిజానికి ఆయన ఏమూడు దినములకో గాని రాలేదు. ఆయన వచ్చిన దాకా నేను ఆగినట్లైతే, నాపంట ఎండిపోయి ఎందుకు గూడ పనికి రాకుండా పోయేది. పంటఎండి పోతే, ఆ బాధ్యత ఆయన భరిస్తాడా, లేక ప్రభుత్వము ఏమైనా భరిస్తుందా? కాబట్టి యీ ఇంజనీరింగు డిపార్టుమెంట్ వారివల్ల రైతులకు ఎంతవరకుసహాయము జరుగుతుంతోకూడా ఆలోచించవలెనని మంత్రిగారిని కోరుతున్నాను. డబ్బు చూస్తే, మనము యీ డిపార్టుమెంటు క్రింద ఏ అరవై లక్షలో ఖర్చు చేస్తున్నాము. రైతులకు tractors కూడ సప్లయి సకాలములో చేయడము అవసరము. నాకు టైము అయిందని అధ్యక్షుల వారు గంట కొట్టారు. ఇంకా ఎన్నో విషయములు ప్రభుత్వము దృష్టికి తేవలసినవి ఉన్నవి. time అయిపోయింది గనుక విరమిస్తున్నాను.

శ్రీ కృష్ణమాచారి:— అధ్యక్షా, ఈనాడు వ్యవసాయశాఖా మంత్రిగారు వ్యవసాయదారులను గురించి బాగానే చెప్పినారు. వ్యవసాయంకోసం గడచిన సంవత్సరం కంటె యీ సంవత్సరం బడ్జటులో ఎక్కువ ధనమే కేటాయించారు. ఇందుకునేను వారిని అభినందిస్తున్నాను. కాని మనదేశంలో నూటికి 80 మందికి పైగా రైతులున్నారు. వారిజీవన ప్రమాణాన్ని పెంచేందుకూ, దేశాన్నభివృద్ధిలోకి తీసుకుపోయేందుకు యిప్పుడు కేటాయించినధనం చాలదు అని నేను గట్టిగా చెబుతున్నాను. మంత్రిగారు వారి ప్రారంభోపన్యాసంలో యీ విషయాన్ని ఒప్పుకున్నారు. ఇట్టి స్థితిలో రైతుల అభివృద్ధి కొరకు ఏమిచేయాలో ఎటువంటి పథకాలు వేయాలో ఆలోచించి, నిర్మాణాత్మకమైన మార్పులను తీసుకురాలేక పోయినందువల్ల నేను యీ డిమాండును ఆమోదించలేక పోతున్నాను. Agricultural department కు సంబంధించినంత వరకూ ఇదివరకుకంటె ఎక్కువ ధనం కేటాయించినమాట నిజమే కాని The capital outlay on schemes of agricultural improvements and research డిమాండు క్రింద కొన్ని లక్షలు, Trading Demand లో కొన్ని లక్షలు తగ్గించ బడినాయి. ఇదేమీ హర్షింపదగ్గ విషయం కాదని మనవి చేస్తున్నాను. మనం ఆహార సమస్యగురించి ఎన్నో విషయాలు మాట్లాడుతూ ఉంటాము. అనేక పథకాలు వేస్తున్నాము. ప్రతిదినం మాట్లాడే విషయాలలో ఆహార సమస్య తీరాలని చెబుతూంగడం ఒక తీరని సమస్య అయినది. ఆహార సమస్య తీరిపోవాలంటే ముందుగా రైతులస్థితి బాగుపడాలి; వారికి వ్యవసాయం చేసేందుకు సేద్యానికి అర్హ

మైన భూమి ఇవ్వాలి; మంచి విత్తనాలు, ఎరువులు సకాలంలో సప్లయి చేయాలి. తగిన ఆర్థిక సహాయం చేయాలి. ఈ సదుపాయాలన్నీ చేయనంతకాలం రైతు పరిస్థితి బాగుకాదు. రైతు పరిస్థితి బాగుకాకుండానే ఆహార పరిస్థితి బాగుపడుతుందనుకోవడం హాస్యాస్పదమైన విషయం. ఆహారపరిస్థితి బాగుకావాలంటే ముందుగా రైతుల పరిస్థితి బాగు చేయాలి. మనం pension demand లో 2 కోట్ల రూపాయలు ఇచ్చాము. Electricity కి 3 కోట్ల రు. లు Police demand కు 5 కోట్ల రూపాయలు ఇస్తున్నాము. Pension Demand కు ఇచ్చినంత మాత్రమే Agriculture Demand కు ఇస్తున్నామంటె నిజంగా ఇది దురదృష్టమనే భావించాలని మంత్రిగారికి మనవి చేస్తున్నాను.

మన దేశంలో పోరంబోకు ఖారిజఖాతా మొదలైన భూములున్నాయి. అట్టిభూములను సేద్యంచేసికొనే నిమిత్తమై హరిజనులకు, బీదరైతులకు తప్పకుండా ఇవ్వాలి. ప్రభుత్వం యింతవరకు కొన్నివేల ఎకరాల భూమిని ఇచ్చింది. నా తాలూకాలో నా ప్రయత్నంపై 18 వేల ఎకరాలను హరిజనులకు పంచి ఇచ్చినారు. అది ఇప్పుడు నాకు తలబాధగా పట్టుకున్నది. ఆ భూములను పంచి 7,8 సంవత్సరములు అయినది. ఏవిధమైన తగాదా లేకుండా వారు ఆ భూములను అనుభవిస్తున్నారు. కాని ఇంతవరకు వారి పేర పట్టాలు ఇవ్వలేదు. అందువల్ల Co-operative Banks నుండి వారికి ఆర్థికసహాయం లభించుట లేదు. Agriculture డిపార్టుమెంటు నుండి ఎరువులు. మొదలైన సహాయం లభించదు. అంతేగాక గ్రామాధికారులు కూడా వారిని బాధలు పెడుతున్నారు. పటేల్, పట్వారీలు తమకు కొంతవాటా ధనం ఇవ్వమంటారు. అది ఇవ్వకపోతే ప్రతి జమాబందీ సమయంలోనూ దావాలు జుల్మానాలు వేస్తామని భయపెట్టి వసూలు చేస్తారు. ఎవరైనా ఇవ్వకపోతే జుల్మానాలు వేయడం వల్ల వారు Collectorate కు పోయి appeal చేసుకోవడం నానాబాధలు పడడం జరుగుతున్నది. వ్యవసాయదారులకు, బీద రైతులకూ భూమిలిచ్చారు, అయినా పట్టాలివ్వని కారణంగా, వారు స్థిరంగా సంతోషంగా అనుభవించలేక పోతున్నారు. ప్రతిరోజూ చిక్కులు పడుతున్నారు. ప్రభుత్వంవారిచ్చే ఎరువులు ఏజిల్లాలోసకాలంలో దొరుకు తున్నాయో నాకు తెలియదు. మెదక్ జిల్లాలో మాత్రం సకాలానికి దొరకడం లేదని నేను చెప్పగలను. పంటలు పండినతరువాత ఎరువులు ఇస్తారు. రైతులకు తిన తిండి లేక పోవడంవల్ల బ్లాక్‌మార్కెట్‌లో అమ్ముకోవడం జరుగుతోంది.

ఎడ్లను కొనుక్కోడానికి తక్కావిపేరుతో ప్రభుత్వంవారు ఋణాలిస్తారు. గొర్రెలు, మేకలు, ఆవులు మొదలైనవాటిని కొనేటందుకు సహాయం చేయటానికి ప్రభుత్వం దగ్గర ఏమీ స్కీములు లేవు. ఒకవేళ వుంటే కాగితాలలో ఉన్నాయేమో గాని, అమలులో లేవు. ఇదిచాలా ముఖ్యమైన విషయం కనుక ప్రభుత్వం తప్పకుండా ఆలోచిస్తుందని భావిస్తున్నాను.

విత్తనాలు సప్లయిచేసే పరిస్థితి కూడా అంతంత మాత్రంగానే ఉన్నది. భూమి దున్నడానికి ఒకనెల ముందుగానే విత్తనాలు కావాలి. దరఖాస్తు పెట్టకుంటే మొల కలు వచ్చిన తరువాత ఇస్తారు. ఆ విత్తనాలు, నిలువ వుండడానికి వీలులేదు కాబట్టి ఎవరికో అమ్మడానికే వినియోగిస్తారు కాని చేలలో పడవు.

Land Mortgage Bank ల నుంచి గాని సహకార బ్యాంకులనుంచిగాని సకాలానికి ఋణాలు లభించడం లేదని మనవి చేస్తున్నాను.

భూసంస్కరణలనేది చాలా పెద్ద సమస్య. ఇప్పుడు ఎంతో వ్యవధిలేదు కనక నేను భూసంస్కరణల గురించి చెప్పదలచుకోలేదు.

ఇక. Minor irrigation schemes ను సక్రమంగా అమలుచేయడం లేదు ఇందుకు నిదర్శనంగా మెదక్ జిల్లా విషయం తీసుకోవచ్చును. 260 చెరువులకు మరమ్మతులు (దురుస్తి) చేయవలసి యుండగా, వాటిలో యింతవరకూ ఒక్కటికూడా పూర్తికాలేదు. 69 చెరువుల విషయంలో పని ప్రారంభించపడుతున్నదనీ, 122 చెరువులు survey చేయబడు తున్నాయనీ, 75 చెరువులు యింతవరకూ survey చేయ బడలేదని ఒక ప్రశ్నకు సమాధానంగా మంత్రిగారే చెప్పారు. ఈ విధంగా 266 చెరువులకు కేవలం 69 చెరువులలో మాత్రమే పని జరుగుతున్నది.

Forest departmentలో జరిగే లంచగొండితనం చెప్పడానికేదుస్సాధ్యం అను కొంటాను. ఈ సభలో మామూలు చిన్న ఉద్యోగులను గురించి మాట్లాడ వలసివచ్చి నందుకు విచారిస్తున్నాను. లంచగొండితనం విషయంలో వారు చేసే దురంతాలు చెప్ప నలవి కాదు. ఈ మధ్య ఒక సందర్భంలో ఒక చౌకీదారు 200 పశువులను పట్టు కోవడం జరిగింది. "ఎందుకు పట్టుకున్నావు, ఏమిటిసంగతి" అనినేను అతనిని అడిగి నాను. అతను నాకు కొన్ని వుత్తరాలు చూపించినాడు, నేనేమి చేయగలను, ఇది నాపై అధికారి వుత్తరువు, వారికి ముట్టచెప్పవలసినది ముట్టచెప్పకపోతే నా నౌకరీ పోతుంది, ఈ పనిచేయడం నాకు ఇష్టంలేదు. విధిలేక చేస్తున్నాను" అని చెప్పి నాడు ప్రస్తుతం సమయంలేదు కనుక అధ్యక్షులవారికి అభినందనలు తెలుపుతూ నా ఉపన్యాసమును ముగించుచున్నాను.

శ్రీ పి. వెంకటరమణప్ప:— ( గోరంట్ల ) అధ్యక్షా ! గౌరవనీయ వ్యవ సాయశాఖా మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ పద్దులను నేను హృదయ పూర్వకంగా ఆమోదిస్తూ ప్రభుత్వ దృష్టికి కొన్ని విషయములను తీసుకరాదలచాను. వ్యవసాయం అన్నివృత్తుల కంటె ఎక్కువ ఉత్కృష్టమైనదని ప్రతిఒక్కరికి తెలిసిన విషయమే. నేలమీద పోయే నల్ల చీమ మొదలుకొని పైన పోయే పక్షి వరకు, సమస్త ప్రాణికోటి వ్యవసాయం మీదనే బ్రతకవలసి ఉన్నది. ఇలా సమస్త జీవులను పోషించే వ్యవ సాయ దారుడు ఈ రోజు తన్ను తాను పోషించుకోలేక పోతున్నాడని చెప్పుటకు

నుండి రావడంవల్ల పనిచేయుటకు ఇష్టంలేకనో లేక స్థానిక ప్రజల వాడుకలు, నడతలు అలవాటు లేకనో వారు ఉత్సాహకరముగా పనిచేయుటలేదు. కాబట్టి village level workers ను ఇతర జిల్లాలవారిని కాకుండా ఆ జిల్లాలవారినే ఏర్పాటు చేసిన, వారు శ్రద్ధగా పనిచేసి రైతులకు చాలా సహాయపడుదురని విన్నవించుకొను చున్నాను. మన వ్యవసాయ మంత్రిగారు రైతుకుటుంబమునకు చెందినవారు కాబట్టి వారికి రైతుల కష్టాలు బాగా తెలుసును. వారు రైతుకష్టాలను తీర్చి వారు పండించే పంటకు గిట్టుబాటైన ధరలు ఉండేటట్లు కృషిచేసి రైతుకోటికి సహాయపడతారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

శ్రీ గోపిడి గంగారెడ్డి :—అధ్యక్షా, అటవీశాఖా మంత్రిగారు ప్రవేశపెట్టిన పద్దులోని అంశములు బాగుగానే ఉన్నాయి. ఎద్దునుచూస్తే ముద్దువస్తుంది, దున్నడం చూస్తే దుఃఖం వస్తుంది" అన్నట్లుగా ఉన్నది: కాగితంమీద ఎన్ని మంచివిషయ లున్నా లాభంలేదు. ఆ శాఖలో జరుగుచున్న అన్యాయములను వెంటనే అరికట్టాలి. అడవులలోని చెట్లన్ని నరకబడుచున్నవి. వాటిని అరికట్టకుండ అడవిలోని చెట్లను కొట్టించి, అడవిలేనిచోట్ల చెట్లనువేయించి ఎంతోడబ్బు ఖర్చుచేస్తున్నారు. వాటి రక్షణకు చౌకీదార్లను, వారిక్రింద పిల్లచౌకీదార్లను, వారిక్రింద కావలివాండ్రను పెట్టి బ్రహ్మాండంగా చేస్తున్నామని చెప్పుకుంటున్నారేకాని అడవి ఎలా నాశనమౌతున్నదో కనిపెట్టడంలేదు. పర్యటనలు చాలాచేస్తున్నారుకాని ఒక్కసారిగూడ మా నియోజక వర్గమునకు వచ్చి అడవి నాశనమగుటకు కారణములేవో విచారించనైనాలేదు.

అడవిని కాపాడటానికి ఒక చౌకిదారును నియమిస్తే అతడుకంచెను, కంపను కూడ మ్రింగేవాడుగా తయారవుతున్నాడు. తెలంగాణాలోని ప్రతిచౌకిదారుకూడ అడవిరక్షణ పేరుతో 4 మానికల బియ్యం, 2 మానికల జొన్నలు తీసికొంటాడు. "ఇచ్చేవారికైనా తెలియదా?" అంటే ఆ రైతులు అంత విజ్ఞానవంతులుకారు. చౌకి దార్లు అరకలను ఏర్పాటుచేసి అడవులను నాశనంచేస్తున్నారు. వారు అడవులను నాశనంచేయకుండా తగిన కట్టుదిట్టంచేస్తే అడవుల అభివృద్ధికి ఇంతడబ్బును ఖర్చు చేసే అవసరమే ఉండదనిమనవి చేస్తున్నాను. గుంటాలజాగీరు ఒకటివుంది. మావిజా ఇవ్వకుండానే, 4 వేల ఎకరాల భూమిలోని అడవికొట్టుకోమని ఆ జాగీర్దారుకు ఇచ్చారు. దానివల్ల ప్రభుత్వానికి రావలసిన 10,20 లక్షల ఆదాయం రాకుండా పోయింది. జంగలాత్ ఖానూన్ ప్రకారము 100 ఎకరాల అడవిని 2,3 సంవత్స రాలలో కొట్టాలనే నిర్ణయమును తొలగించి, ఇష్టంవచ్చినట్లు 500,600 ఎకరాలను నరకడం జరుగుతోంది. రోజుకు 2 వేలమంది అక్కడ పనిచేస్తున్నారు. అచ్చట వారు అడవిని నాశనముచేస్తున్నారు. ఇచ్చట మనం అడవులను పెంచాలని ప్రయత్ని స్తున్నాము. వినోబాభావేగారి దయవల్ల వెట్టిచాకిరి అనే పేరుపోయి శ్రమదానం,సంపత్తి దానం అనే పేరువచ్చింది. అంతేగాని వాటిని తొలగించటానికి ప్రయత్నించటంలేదు.

అడవి శాఖలో ఎన్నో అన్యాయాలు జరుగుతున్నాయి. ఒక చౌకీదారుగాని ఒక చప్రాసీగాని లంచంతింటే ఆ బాధ్యత మంత్రిగారిదే. డిపార్టుమెంటులలో ఉన్న లోపాలను తెలుసుకోలేక పోవటం ప్రజారాజ్యములో మంచిదికాదని మనవి చేస్తున్నాను. రైతులకు విత్తనాలు, మొక్కపైకి వచ్చిన పిదపనే దొరుకుతున్నాయి. అధిక ఆహారోత్పత్తి పేర డబ్బుతీసుకోవటం జరుగుతోంది. అధికోత్పత్తి మాత్రం ఎక్కడా కనిపించటములేదు. రైతుకు పంటపండించే అధికారం ఉందికాని తాను పండించిన పంటకు ధరను నిర్ణయించుకొనే అధికారము లేదు. ఒక కూలి తనకు కావలసిన కూలి చెప్పగలడు. గొల్లవాడు తను అమ్మె గొఱ్ఱె ఖరీదును చెబుతాడు. సాలెవాడు తను నేసిన బట్టఖరీదు చెబుతాడు. కాని రైతుమాత్రం తాను పండించిన పంటధర చెప్పలేడు. పంట పండించటానికి రైతుపడిన కష్టములను గుర్తించలేనివారు ఏ బొంబాయిలోనో ఉండి ఈ పంటకు ధరను నిర్ణయిస్తున్నారు. తాను పండించిన పంటకు తాను ధర నిర్ణయించ గలిగినపుడే రైతుకు ఎక్కువ ఆదాయం వస్తుంది.

रिआया के रिआया होने से राजा, राजा कहलाता है।

మత్స్యములను పెంచుతామని చెప్పారు. లండనునుండి మత్స్యములను భారతదేశమునకు తీసుకువచ్చి ఇక్కడ మత్స్యములతో కలిపితే, వాటికి కల్గే సంతతి ఎంత ఆరోగ్యముగా ఉంటుందో అందరు ఆలోచించాలి. పల్లెటూర్లలో లభించే చేపలు బస్తీకి తీసుకుపోయి పల్లెటూరు వారికి తిండిలేకుండా చేయరాదని మనవి చేస్తున్నాను.

పశువుల అభివృద్ధికి, వైద్యానికి తగిన సదుపాయములు కలుగ చేయాలి. అధికారుల ఇంగ్లీషుభాష పల్లెటూరివారికి తెలియదు. పశువుకుకల్గిన జబ్బును వారు తెలుగుపేరులో చెబితే వైద్యులు అర్థం చేసుకోలేరు. ఈ విషయాలన్ని మంత్రిగారు శ్రద్ధతో విచారించి తగిన మార్పులు చేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

*శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం-జనరల్) :- అధ్యక్షా : వ్యవసాయ అటవీశాఖామాత్యులు ప్రవేశపెట్టిన డిమాండులను బలపరుస్తూ నేను కొన్ని సూచనలు చేయదలచుకొన్నాను. అటవీ రక్షణగురించి శ్రద్ధ తీసుకొంటానని మంత్రిగారు చెప్పినారు. కాని దానివిషయంలో మాత్రం నాకు సందేహాస్పదంగా ఉన్నది. అటవీరక్షణకు కావలసిన సదుపాయాలను ఏర్పరచవలెనని కోరుతున్నాను. ప్రపంచ చరిత్రను చూచినట్లయితే, జాతిజీవనంలో – ఈ వృక్షముల పాత్ర చాలా ప్రముఖమైనదని ఋజువవుతుంది. ఈరోజున మనం అటవీ సంపదను చాలా neglect చేస్తున్నాము. ఈ పర్షియన్ డిజర్ట్సు ఒకప్పుడు మహారణ్యాలు అయిఉండవచ్చు. ఇట్లాగే చెట్లను నరకుతూన్నట్లయితే రానురాను సాయిల్ ఎరోజన్ ద్వారా, మన నాగరికతకే భంగం వాటిల్లే ప్రమాదం యున్నది.

అందుచేతనే మన యూనియన్ మంత్రిగా ఉండిన శ్రీ కె. యం. మున్షీగారు యెంతో దూరదృష్టితో ఆలోచించి వనమహోత్సవములన్నవి పెట్టినారు. దీనినిబట్టి మనదేశంలో కూడ అడవుల ప్రాముఖ్యాన్ని యిప్పుడిప్పుడే గ్రహిస్తున్నారని తెలుస్తున్నది. కాని సరియైన publicityలేక చెట్లయొక్క ఉపయోగాలు ప్రజలకు సరిగా తెలియనందువల్ల చెట్లను నరికివేయడం జరుగుతున్నది. ఆహార కొరతను తీర్చడంలో చెట్ల పాత్ర అద్వితీయ మైనది. చెట్లయొక్క ప్రాముఖ్యాన్ని గురించి కొన్ని విషయాలు యిక్కడ చదువుతున్నాను.

"Trees have a rightful place in the general economy of every country. Forestry is not a mere handmaid of agriculture. Forests are inexhaustible reserves for providing subsistence to our growing millions. For, trees mean water, water means bread and bread is life".

చెట్లను నాశనముచేయుటవలన కొన్ని దుష్ఫలితాలు కలుగుతున్నాయి. కరువులు రాకుండా, పంటలు సరిగాపండి, వర్షాలు పడాలంటే అడవులు చాలా ముఖ్యం. పోడు కల్టివేషన్ గురించి సోదరి వాణీ రమణారావు కొన్ని విషయములు చెప్పినారు. దీనివల్ల కొండజాతివారికి కూడ అంత ఉపయోగం లేదు. కనుక దీనికి సరియైన మార్గం ఆలోచించాలని కోరుతున్నాను. ఈవిషయాన్ని మాత్రం దేశసౌభాగ్యదృష్టితో దేశరక్షణ దృష్టితో ఆలోచించాలని మనవిచేస్తున్నాను. కొండజాతివారు కొంత ప్రాంతాన్ని నరకి, ఆ ప్రాంతంలో కొంతకాలం ఉండి, అక్కడినుంచి ఇంకో ప్రదేశానికి పోతూ- ఇట్లా అడవులనంతా నరికివేయడం జరుగుతున్నది. ప్రభుత్వం ఈ విషయంలో వెంటనే శ్రద్ధ వహించాలి. ఆ విధంగా వారు చెట్లను నరుకుతూ, ఒక ప్రదేశం నుంచి యింకో ప్రదేశముకు పోకుండా ఒక ప్రదేశంలోనే ఉండేటట్లు ఆ భూములమీద పట్టాలు యిచ్చినట్లయితే బాగుంటుందని మనవిచేస్తున్నాను. ఈ విధంగా చేసినట్లయితే వారికి జీవనాధారం ఏర్పడుతుంది. రెండవది అటవీసంపదను రక్షించినవారము అవుతాము. కొన్ని కొన్నిచోట్ల చూచినట్లయితే రాతికొండలు తప్ప ఒక్క వృక్షము కూడా కంటికి కనపడని పరిస్థితిలో అడవులు ఉన్నాయి. తరువాత కొండల దిగువ గ్రామాలలో ప్రజలకు చెట్లు supply చేసి నాటుకోవడానికి అవకాశం కల్పించాలి. చెట్లనునాశనము చేయుటవల్ల కలిగే దుష్ఫలితాలను గురించి ప్రవీణుల అభిప్రాయాలు కొన్ని మనవిచేస్తున్నాను.

"It is worth nothing that it was possible for civilizations in the past, to come into existence by cutting certain percentage of the forests. Later on a large percentage of forests was destroyed by over-cutting and overgrazing bringing in return great harm to civilisations as supported by the chronicles of history. Man should learn from the experience of his forefathers in other regions of the world and try to adjust with nature. In the present struggle for existence, no country

should afford to forget the long-range view of survivals and prosperity of the human species as a whole. He should not err by adopting short-sighted policy and forgetting the far-reaching effects of his present action on the future generations. It should not be forgotten that short cuts are not often the safest and surest routes".

"We often forget that if humanity is to survive forever and if agriculture is to be prosperous to feed humanity, it must have sufficient forests. There is a balance maintained in nature and it should not be disturbed. Nature has its roughless rule of thumb and does not spare any if her balance is disturbed".

ఇక వ్యవసాయానికి-అడవులకు సమన్వయంకుదురుతుందా అనవచ్చు. జనాభా పెరిగిపోతోంది, కాని ఆ జనాభాకు తగ్గభూమికావాలి, ఆహారపదార్థాలు కావాలి, అందువల్ల అడవులనునరికి వ్యవసాయంచేస్తే బాగుంటుంది అనేవారు ఉన్నారు. ఆ రెంటిని సమన్వయంచేసే విషయాలు కొన్ని చదువుతున్నాను

"The problem of checking up of the denudation in mountainous regions, on which the source of perennial watersupply, stability and fertility of soil and the suitability of climatic conditions depend, the question of controlling the erosion along the treeless banks of rivers and streams leading to ravines the matter of stopping of sea-sands on coastal tracts, etc., are some of the problems as important to human life, and prosperity as agriculture or any other subject essentially connected with human habitation and civilization itself. It cannot be forgotten that a certain percentage of land covered with vegetation and tree growth is essential to be maintained on the grounds of ecology for any habitation. The benefits of forests to humanity are too many and cannot afford to be ignored or belittled.

A similar question is often asked: Whether forest should survive or the agriculture. Though it seems a pertinent question on the face of it, it will be found on examination that it is the most irrelevant of questions because there cannot be agriculture without forests being there. Forests need not be wiped out of existence to make agriculture live nor is it necessary for agriculture to disappear to make forest survive. But even then one thing cannot be denied that prosperity of agriculture indirectly depends much on the forest and that is perhaps why forest is said to be foster-mother of agriculture. Such proportion of forest as is essential for the prosperity of agriculture will have to be maintained even after admitting that agriculture deserves to be given priority in the general scheme of things. It cannot be ignored that it would be difficult for agriculture to survive, if forest disappears altogether.

ఇంకొక ముఖ్యవిషయము అటవీసంపదను, కాటేజి ఇండస్ట్రీస్‌కు ఉపయోగించుకొనవచ్చును. పేపరు ఇండస్ట్రీస్‌కు యిదిఎంతో ఉపయోగపడుతుంది. ఈ విషయంలో ప్రభుత్వంవారు శ్రద్ధవహించాలని కోరుతున్నాను. Game sanctuaries కొన్నిచోట్ల ఉన్నవి. కొన్నిచోట్ల లేవు. మిగిలినచోట్లలోకూడ పెట్టవలెనని కోరుతున్నాను పశువుల విషయంలో శ్రద్ధవహించవలెనని మనవిచేస్తున్నాను. రసాయినిక ఎరువులు యెంత ఉపయోగకరంగా ఉంటవో, పశుసంపద యెరువులుకూడ అంతే ముఖ్యమైనవి. చాలా పశువులు వైద్యశాలలలో నరకబడుతున్నవి. దీనిని అరికట్టవలసినదిగా కోరుచున్నాను. వ్యవసాయోత్పత్తికి యీ పశుసంపదకూడ ముఖ్యమని మనవిచేస్తూ ఈ అవకాశం యిచ్చినందుకు అధ్యక్షులవారికి నా నమస్కారములు

*The House then adjourned till Half Past Eight of the clock on Monday the 10th March 1958.*